నాంపల్లి దేశముఖ్లును పటేళ్లునగు
మహారాజశ్రీ వెంకటరామారెడ్డిగా
రు శ్రీకృష్ణదేవరాయలయాంధ్రభా
షానిలయమునకు ధర్మార్థముగా ని
చ్చిరి - 30-10-1901

వెలయుం-రూ-౧

క॥

# పాంచాలీపరిణయము.

క॥

## ప్రథమాశ్వాసము.

క॥

॥ శ్రీరంగేశుఁడు చంద్రపుష్కరిణికా భృంగీత సంగీత భం
వ॥ గీరమ్యశ్రుతికాత్మ నాభి భవభూగీతాశ్రయత్కర్ణుఁ డ
ర్ణోరాశిప్రతిమాన సహ్యగిరి సూనుక్రోడ దృక్కర్ణ శ
క॥ య్యారంగ న్మకుటోపధానిత భుజుండర్పించు మాఁకిష్టముల్
॥ తన కోదండముఁ గ్రుంచెఁగా తనదొనల్ ధట్టించికట్టించెఁగా
క॥ తనచేతల్ వరమందు వానిశిరముల్ దండించెఁగా యిమ్మహీ
తనయేశుండన కారఘూత్తము గుణస్తోత్యంబు గావింప భ
క॥ ర్గుని నిర్మత్సరు భక్తవత్సలుని బేర్కోఁజెల్లుఁగా యేరికిన్.
॥ బంగరుబొజ్జ పల్కుబడిపైడలి పచ్చనిమేను తమ్మిపూ
సీ॥ సింగపుఁబీఁట తెల్లగరి చిన్నిపటాణి కడానివన్నె ముం
గొంగుల తండ్రి పాటపెళుకుం దొలుకానుపు చాలుమోము పై
క్కుంగల వేల్పుమాకుఁ దనకుంగల యేండ్లొదవించుఁ గావుతన్.
॥ ఒండురదంబు పోవిఱిచి యుక్కునఁ జక్కని మొక్కలీఁడనన్
రెండవకొమ్ము తొండమున నేర్పునమాటి మతంగశృంగ వే
దండముల్ గ్రహించి తనదాసుల కీఁబరికించి హస్తివ
ఉ॥ క్త్రుండయి మాయుబోయవారకుం గొడుకై తగువేల్పుఁ గొల్చెదన్.
॥ కాయలా యాచన్నదోయి జోడనిపాదములపై చెనా వీణ చెలియనిల్ప
నిరుగరంబుల మొక్కి యెత్తిమీటినమీఁదఁ జేవ్రేయసన్నుతుల్ చేసెననఁగ
పల్లకిపల్కుల్లసిల్ల నిర్వరమొక్కఁడైయున్న జోడెవ్వరన్నజాడ
మ॥ తాగాత్రలాలనా భోగంబుగావింపఁ దానమానంబుల తేనెగురియ
డొలునకు డొలుచెల్లుగాఁ జాలుకంపితమునఁ గంపితమయ్యె విధాతృశిరము
రాగమున రాగమబ్బెఁగా స్రష్టకనఁగ । వీణవాయించు కల్యాణి వాణిఁగొల్తు.
మాసఖులు వ్యాసవాకుజ । భాసశ్రీహర్ష బాణ భారవి కాళి
శా। దాస భవభూతిమాఘ మ । హాసంస్కృతకవి కవిత్రయాంధ్రకవుల్.
॥ ప్రబలమతిన్ నుతింతుఁ బ్రతిభాకృతిభాషిత భారతీశులన్
గబళిత సర్వదర్పములఁ గావ్యచమత్కృతి కాళిదాసులన్

నిబిడతపోవిలాసులఁ దృణీకృతవాసులఁ గాకమాని రా
మ బుధనిధిన్ బ్రబోధసుధి మత్ప్రపితామహునిన్ బితామహున్.

క॥ కుకవి రచన కవితసకలము। సుకరంబన చుండు బుధులు శోధింపమి చే
ముకురము గన్నపుఁజేకడా। మొకముకురూపము సురూపమును నేర్పడుటల్.

వ॥ అని యిష్టదేవతానుతియు శిష్టకవి నమస్కృతియు దుష్టకవి నిరాకృతియు
గావించి పాంచాలీపరిణయ ప్రబంధ నిబంధనంబునకు సమకట్టియున్న సమయ
బున.

చ॥ తలగడగా నమర్చుకొని దక్షిణపాణిని జానువంటఁగా
నలవడఁజాపుకొన్న వెఱహస్తముచే నితఁడింత నాఁడె నన్
బలువిడిఁ బాదసేర్చెనని పాదములొత్తు రమాతుమల్ వినన్
దలకడఁబాటమెచ్చుచును నారదుఁడెప్పుడు వేల్పుపొల్పుగన్.

మ॥ కలలోనంగరుణించి నన్నుఁబలికెం గద్రేశు కోదండ హ
స్తలతాకృష్ట ధనుఃప్రకాండ విగళద్ధారాళ సారామృతో
జ్జ్వలమాధుర్య నిదానచూడ్కుడుత నాంచారూ రదాచ్ఛాదనాం
చలవిచ్ఛేదన సాధుసీధు సముదంచద్దంత వాగ్వైఖరిన్.

క॥ పాంచాలీపరిణయకవి। పంచాస్య భవత్ప్రబంధపదసంబంధ
ప్రాంచనము సుహృత్కవి రాట్కాంచనము సహృ ద్విరేభ కాంచనమునుమీ

గీ॥ అల్లసానివాని యల్లికబిగిసొంపు। ముక్కుతిమ్మనార్యు ముద్దుఁబలుకుఁ
బాండురంగసుకవి పద్యంబుహంవృసు। గాకమానిరాయ నీకె కలదు.

క॥ అంచితమతి కృతిపీవొన। రించినకృతి ద్రౌపదీపరిణయము మాక
ర్పించుము తెనుంగుఁగవిత విరించివిభువిఁ గాకమాని శ్రీమూర్తికవీ.

క॥ అనినన్ మేల్కాంచి విరించన జనకఘనార్త కనక సంపాతవిలో
చన శంపాసంపాత। స్వనుకంపా కంపితాత్మ సంతాపుఁడనై.

ఉ॥ దొంగిలి యర్ధరాత్రమున దొంగరడిప్పొడియాళువారికై
బంగరుగిన్నెఁదెచ్చిన కృపానిధి యంత్యజు దాసరిన్ స్వకీ
యాంగముఁజేర్చు రంగపతి యంగజుతండ్రి మదీయకావ్య సా
రంగ విలోచనామణికిఁ బ్రాణవిభుండఁట భాగ్యమెట్టిదో.

క॥ అర్యకులభాతి నవరస। గర్భిత సందర్భలహరిఁ గరఁగని భూభృ
న్నిర్భాగ్యుల కిత్తురె వై। దర్భి నిర్భీక షంక దర్పితకవితల్.

వ॥ అని యుద్యోగింప యద్దేవతాపురందరునకుఁ గాపురంబై ధరాపురంధ్రికి నూ

క॥ రంజై యనపుంగవ్వరంబునకుఁ గొప్పరయై యపరిమిత ఘనపురంబైన శ్రీరంగ
పురం బభినుతించెద.

క॥ దితిజరాజసుజాత దేవప్రాజాగ్రహం బుభయ సహ్యాగ్రభవా ధ్యుదయభూమి
భక్తాంఘ్రిరేణుభా గ్యోక్తియు క్తిఁ దంబు మునివాహనాంభోష్ఠ మోక్షదాయి

క॥ తిరుమంగయకృత ప్రథిత సప్తసాలంబు చంద్రపుష్కరిణికా జన్మసీమ
ధర్మవర్మాది భూధవ తపఃఫలరాశి కాశీవసత్యభాగ్యస్మరణము

వ॥ కుంతితాన్యోప కంఠసోత్కంఠవన్య। కుంతకలకంఠ మపరమై కుంఠమనద
మొత్తపుబిడారుముంగిటి మొదటివేల్పు। గొంగదొర ప్రహుకుటులరు శ్రీరంగమలరు.

క।

లయగ్రాహి.

అంగము త్రివేదికి మృదంగము కళానటికి సింగము మదాధికకురంగముల కెల్లన్
క। శృంగము శుభాద్రికిఁ దరంగము యశోబ్ధికిఁ బతంగము ప్రకల్పిత భుజంగముల కెల్లన్
సంగము సుఖోన్నతికి భృంగము వనావనికి భంగము రిపుద్విపతురంగముల కెల్లన్
క రంగము విభూతికి మతంగము గజాళికి శతాంగము మురారికి సిరంగము దలంపన్.

సీ॥ నింగిఁ బొరలఁ గవేరజ మునింగి సిరంగని సేవచేసి యా
పొంగలి ముద్దమ్రింగి విధుపుష్కరిణీజలమాని మానితో
త్తుంగ తరూత్తమోపవనిఁ దూటి సిరంగములోన నున్నవాఁ
డుంగను నాయుటంకు టకటాంకుపురంబుల కాపురంబులన్.

॥ ఆరంగమునకు నధిపతి। సారంగము రంగశాయి సారంగమద
శ్రీరంగన్నిటులాంగుఁడను। దోరంగద ఘుణఘుణాంకృతుల సిరులొసఁగున్.

మ॥ శేషాచలాధీశ భీషణనిశ్వాస మాతరిశ్వగ్లాని మాన్పకొనఁగ
నాహోబలాహార్య కాహూకర స్తంభ సంభవోద్గత శిఖాశ్రమము దీఱ
సింహాద్రి దైతేయ సంహారసమయోద్ధ దృష్టిదంష్ట్రానల సృష్టి తొలఁగ
హస్తిశైలాజ ప్రశస్తహోమమహాతాశ జాతాపఘన ఘనౌష్ణ్యంబు దీఱ
నుభయసహ్యాద్భవా మధ్యమోర్వి చేరి। గావ్పవలిదిండిపాన్పుపైఁ గడమపడక
పవ్వళించిన శ్రీరంగభర్తకర్త। చల్లఁగాఁ జూడఁ బెల్లదె యెల్లజనుల.

సీ॥ అప్పఁ దిద్దినవాని యటులు వేగినదాఁక బొమ్మలాటలుగన్న భోగిపగిది
మధుమాసగమన తామ్యన్మానసునిభూడి కాసిగా నాఁకొన్నవానికరణి
స్వసమాసుహృద్వినాశ శ్రోత్ర విధమునఁ బారణాస్వాదనం భరసరూఢి
బహుకాలకృతశిరో భ్యంగసంగతు భంగి బహుళ భూరితతాంత భావుభాతి

నుభయసహ్యాత్మజామధ్యమున వెలయుచు। నిరవద్యమోదాకేదారకన్ దెస వుచున్న
పూర్ణకరుణామృతము జల్లు భోగిభోగ। భాగవిశాయి తు శ్రీరంగపతిం దలంతు.

మ॥ కటిచక్రంబు గళంబు కంబువు ధనుఃకాండంబు భ్రూవల్లి కా
హటి రోమాళి తలంబు ఖడ్గము భుజాద్వంద్వంబు దండంబు లె
వ్వటికిన్ బ్రోవంగ వందిబృందముల నేర్పాటొప్పంగాం జేయు మం
గిటి రంగన్నిధి రంగభర్త నితరుల్ కీర్తింపంగా నేర్తురే.

ఉ॥ ఎన్నండు సహ్యభూభవన మించుక గాంచుట తానమాడు టెం
దెన్నండు సప్తసాలగము నేర్పిత మెన్నండు గారుడధ్వజ
ప్రోన్నతిం జూచి యడ్డపడం బోవుట యెన్నండు పన్నగేంద్ర శా
యి న్నిను వేండు టెన్నండొకో యిందిరమందిర రంగమందిరుణా.

ఉ॥ ఉండిన శేషశైలమున నుండుట చక్కన కాకయున్న వే
దండ నగప్రకాండపతి దండన యుండుట లెస్స యట్లుగా
కుండినం గుండలీంద్ర శయనా పరిశాయి నినుం భజించి నీ
యండన యుండుటల్ సుఖములండ్రు రమావిభు రంగవల్లభా.

సీ॥ రావణకుంభకర్ణ ద్విపేంద్రములకు సింగంపువేయి మారంగశాయి
తెంకలపంకాంధ మింకింపందగు పొంకపుం గన్నుదోయి మారంగశాయి
కన్నబిడ్డలతేవం గాంచికీకులం బ్రోవ బంగారుతాయి మారంగశాయి
వడవడిపిల్ల గీర్లడియ నిక్కడ నాథునిం గూడం జేయి మారంగశాయి
నింగితజ్ఞులహోయి మారంగశాయి। మంగయబలూంత చేయి మారంగశాయి
యంగదభృత్సానుయాయి మారంగశాయి। భృంగసంకాశ కాయి మారంగశాయి

సీ॥ పాంపపూపాన్పుపైం బవళింత గన్నవాం డడియని ప్రోల్మాగంబయినవాండు
తలగడసొంపుగా వలచేయిడినవాండు తొడం జాచు నెడమకేల్ల్కడిమివాండు
పుడమిలచ్చియు నొత్తు నడుగుందమ్ములవాండు పడమటితలయంపిం బరగువాండు
జేజేతపసిపాట చెవిసోంక వినువాండు తాతపొక్కిటిచక్కిం దనరువాండు
మేటిగుడికోట లేడింట మెలంగువాండు। గాడ్పుకడలికవాంకయగడ్డవాండు
తొంటికబ్బంపు మొదటిపల్కింటివాండు। కలంకగడకొత్తు మాపాలం గల్గినాండు

క॥ ఏతాదృగ్ధృతికంబుధి। జాతాదృక్స్వకజాత శాతద్యుతికిన్
వాతాహతిజాతాంబు। వ్రాతస్రోతస్వినీ నివాసతతికిన్.

క॥ పంకజగేహాగృహికిన్। గుంకుమ సంకుమదపంక ఘుమఘుమిత హిమా
శాంకసుపరిమళిత విమా।నాంక బహిర్మహిత మంటపాంగణమహికిన్.

క॥ శ్వసనగ్రసనవ్యసనా। భ్యసనామితకిసలరసన పర్యంకునకున్
వసనాధ్యసనత్యసనా। ధ్యసనకృశస్థైర్యసూర్య పర్యంకునకున్.
క॥ సంసారవిరంసారస। హంసాగమమేఘునకు ఘృణామోఘునకున్
కంసాసురహింసాభర। శంసాభరణునకు భక్తజనశరణునకున్.
క॥ కౌస్తుభమణిఘృణిఘుసృణ। పాయస్తోమీకృత భుజాంతరాంతవ్యతికిన్
నిస్తులతులసీభృతకిన్। కస్తూరీరంగపతికిఁ గమనాకృతికిన్.
వ॥ అర్పితంబుగా నాయొనర్పంబూనిన పాంచాలీపరిణయంబునకుం గథాక్రమం బెట్టిదనిన.
క॥ ఆయాజ్ఞసేనతనయా। జాయాకళ్యాణకథలు జనమేజయ భూ
నాయకుఁ డడిగిన వైశం। పాయనుఁ డిట్లనియె సరసభాషాప్రౌఢిన్.
క॥ పాంచాలదేశమున రా। జించుం గాంపిల్యపురము నిజసౌధశిఖా
కాంచనఘటఘట్టనగళి। తాంచితరవినేమి నిశ్చయదవప్రంబై.
క॥ పాంచాలరాజధానీ। పంచజనుల్ ధీప్రపంచపంచేషుగురూ
దంచితమంచికలాహవ। పంచముఖుల్ భూమివిభవపంచాస్యులహో.
సీ॥ అచటి ప్రాజ్ఞుల కమర్త్యాచార్యుఁ డజ్ఞాతగణితి పత్రిక వ్రాసి పంపి తెలియు
అచటి రాజనివాసమస్త్రాభ్యాస భాగ్యంబునకుఁ గాచు భార్గవుండు
అచటి కోమటుల యక్షాధ్యక్షుఁ డవసరంబై యప్పుపడియైన నడుగఁబంపు
అచటి రెడ్డికొమాళ్ళనల హలాయుధపాణి నాఁగునకడుగు ధాన్యంబుకొంత
అచటి యొకపాటిదొర మదహస్తులకును। నైత్తుగున్నలు దిక్కులమత్తకరులు
అచటి లేరాచలాయంపు టలఁతి తేజి। కింతరెండవ తరబడి యింద్రహయము.
ఉ॥ కొండలు ప్రక్కలించుకొని కుండలవంచిన జాడ జాఱఁగా
నుండు మదప్రకాండము పయోనిధి దాఁటి విరోధిఁ దత్ప్రయః
కాండము తొండముం గొని తగన్ నిగఁ జిమ్ముచు బైటవైచు వే
దండములుండుఁ గొండలవిధంబున నెప్పుడు నప్పురంబునన్.
మ॥ కటకక్షోణి తురంగసంఘములకున్ గంజాపుతేజీల కు
త్కటవాదం బాదవంగ మీకు నడ మీకా నిబ్బరం పంగమె
న్నటికిన్ వేరని పోరుదీర్ప నడుమందా ముండి యింద్రాశ్వముల్
నటనల్ నేరిచెఁ గానిచోఁ గను టెటుల్ ధారాధరత్వోన్నతుల్.
శా॥ చూడంజూడ నొయారముల్ గులుకు రాజుల్ రాజమార్గంబులం
గూడంగూడ విరాళిఁ దేల్చిన లతాంగుల్ తల్లతాంగుల్ కదుం

బాడఁబాడ మనంబులింపఁదగిన సమ్యగ్గాయనగ్రామణుల్
వాడన్వాడ గణింపనొప్పుదురు తేవల్ గుప్ప నాపోవులునన్.

శా॥ కాంపిల్యప్రమదామణుల్ మణిశలాకా రూపరేఖాకళల్
శంపావల్లి మతల్లి కాతను శిరీషల్ పూర్ణిమాసక్త న
క్తంపాకంప పరంపరాద వదనల్ తారుణ్య నైపుణ్య సూ
ర్యంపశ్యద్ధృతమధ్యకార్శ్య లఖిలశ్యామాభి రామాకృతుల్.

క॥ అమ్మేటికోట పట్టుం। గొమ్మయగుం బాడవునకుఁ గొమ్మలపై లేఁ
గొమ్మలజేజేమ్రాఁకుల। కొమ్మలకౌనసున్న విరులకోఁతలె గుబుతుల్.

క॥ ఆప్రోలు చెప్పనొప్పగు। నప్రోలూఖలఖలారి వరధాన్యహతి
క్షిప్రకర ముసలవిసరా। బ్జప్రద్యోతన కులాధిపప్రకరంబై.

చ॥ ద్రుపదుఁడు రాజు తత్పురికిఁ దుందిలధృత్య ధరీకృతామర
ద్రుపదుఁడు సప్రమత్మద విరోధిశిరోధి మణీఘృణిస్ఫుర
ద్విపదుఁడు చక్రవాళ పరివేష్టిత భూభువనార్థి సైంధవ
ద్విపదుఁడు శాశ్వతాత్మ శమథద్విపదుండు నృపాలమాత్రుఁడే.

క॥ ద్రోణాచార్యుల సమర। క్షోణిని నిర్జించునట్టి సుతు వాసవభూ
పాణిగ్రహణార్హం గ। ళ్యాణిఁ దనూజాతఁ గాంతునని యతఁడంతన్.

శా॥ గంగాతీరము చేరి యాద్రుపదభూకాంతుండు కాంతారవా
సుం గళ్యాణ గుణాఘృణాబునిధి యాజుం గోరి యాచార్య వ
ర్యుం గావించి సమస్తసంయములు పేర్కోఁ బుత్రకామేష్టి చే
యంగా సాంగసమాహుతి గ్రహిళమా నాహూమకుండంబునన్.

శా॥ జ్వాలాభీల విశాలదేహుఁడు మహాచాపాసి భాస్వత్కిరీ
టాలంకారుఁడు వర్మధారుఁడు శతాంగారూఢుఁడై పుత్రుఁడ
క్కీలింబోలి జనించె వెంటనె మృగాక్షీరత్న మత్యుల్లస
ద్బాలేందూపమ ఫాల బాలవికసత్పద్మాస్య జన్మింపఁగన్.

క॥ ఇంచిన వేడుక నపుడుద। యించిన సుతకృష్ణ సుతుఁడు ధృష్టద్యుమ్నుం
డంచు నశరీరవాణి వి। రించిసముల్ మెచ్చ నుచ్చరించె నిజేచ్ఛన్.

గీ॥ యజ్ఞహుతవహ్నిఁ జనియించు యాజ్ఞసేని। సంజకడమబ్బు నడుచక్కిచంద్రరేఖ
చిగురుకొమ్మావి చేరిన చిన్నిచిలుక। నిచ్చలపుఁగెంపుతాళిలోఁ బచ్చవోలె.

క॥ ఆక్షితిపతి యాజునకున్। దక్షిణధేనువుల లక్షదయ చేసె ప్రజన్
రక్షించి సుతుల నిద్దఱ। వీక్షించి ప్రమోదలహరి విహరించె రహిన్.

శా॥ భూవిఖ్యాతముగా మఖాగ్నిముఖ సంపూర్ణోదయా కోకిలా
దేవీగర్భ సుధార్ణవామృత సముద్రీనిద్ర వామ్మించు హే
లావైభూపల సౌధవీధిఁల జోలల్పాడి యాడింతు రా
లావణ్యాంబుధుల్ వధూమణులు తొట్లంబెట్టి రాజాత్మజన్.

గీ॥ కోకిలావెంతయుఁ బెంచు కుచములించు। కోకిలాదేవి మధుమత్తకోకిలాళ
లాప ద్రుపద వధూటీలలామ యొక్క। నాఁటఁ బెంచుకుమారులఁ బూఁటఁబెంచె.

క॥ ప్రాయంజదువన్ గేయము। జేయతఁజేయంగ సాముచేయన్ ఖండా
ద్రేయన్ హయమెక్క నుపా। ధ్యాయులకడ బాల్యముననె ద్రౌపదినేర్చెన్.

ఉ॥ ఏయుఁగతోరమార్గణము లివ్వలికవ్వలి కద్రదూయఁగా
ద్రేయు ధరాస్థలిన్ సబిళి వెంటనె గాంగరుఖురంబులేనఁగాఁ
జేయును నుగ్గునూఁచములు చెట్టును జట్టును గొట్టి బిట్టుగా
నాయనలాయన ప్రభవుఁ డాయన యౌవనగర్వసంపదన్.

క॥ అన్నిన్ని చెలువ దాఁగన। ద్రుమ్చిళ్ళను నాల్గుకంబములయూటలు మే
ల్మచ్చులును గచ్చకాయలు। నచ్చన గండ్లాను సరివయస్యలతోడన్.

గీ॥ నాఁగుఁదేఁట్లన ముంగురుల్ ముడికిఁగూడ। రేఁగుఁబండ్లన బొమ్మనరేఁగునట్టి
లేఁగుచములాఁడఁ బోఁడిమితోఁగుమారి। గోఁగుఁగామవిధంబునఁ గొంతయొదిగె.

ఉ॥ చొక్కపుఁగట్టుగట్టి పిరిచుట్టుగఁ బుట్టముఁజుట్టి చూచితా
గ్రక్కునఁబైఁటవైచుఁ బ్రజగన్గొన ముంగిటికేఁగి దాదిచా
టక్కడఁగోరు నాత్మపతి యొర్దుఁ డౌనఁబోయి శీర్షముం
జక్కగవాంచు నిందుముఖి శైశవయౌవన సంధిసంధిలన్.

ఉ॥ చొక్కపుమల్లెమొగ్గలయి చూపఱకన్ బదరీఫలాబులై
చిక్కని పోకలై విరులచెండ్లయి నిద్దపునిమ్మపండులై
చక్కని బొంగరమ్ములయి జక్కవలై యుపరంజిబిందెలై
మిక్కిలునిక్కి పిక్కటిలె ముద్దియకుం జనుగబ్బి గుబ్బలుల్.

క॥ జిగిలోజిగి మొగమునకున్। బిగిలోబిగి చన్నుఁగవకుఁ బేదటికములోఁ
దగుపేదటికము నడుమున। కిగురుంబోడికి వయోమహిమ వహికెక్కెన్.

ఉ॥ కన్నులువిప్పలై నగుమొగంబునకుం దగువన్నెదెచ్చె నున్
జన్నులుగొప్పలై యురముచక్కికి వన్నియదెచ్చెఁ బెన్నెరుల్
వన్నియదెచ్చె సోగలయి వాటపువెన్నునకుం గటీతటం
బున్నతిగాంచి కౌనున కహాయన వన్నియదెచ్చె నిచ్చలున్.

సీ॥ కచపాళి రుచికేళి గప్పఁ గప్పినయప్పుడె పికిలి యుల్లి వట్టించుకొనియె
జఘనభారము కొంత జనియించినప్పుడె రథమున కలఘు చక్రంబ మర్చె
మందయానప్రౌఢి సంధిగొన్నప్పుడె యంచ తేజీఁ గట్టె నరదమునకు
గొప్పలు గుబ్బలైనప్పుడె చైత్రయాత్రకుఁ బూర్ణఘటు లెదుర్పడియెననియె
నింతి బొమతీరు గనిన విల్లెక్కువెట్టెఁ। జూపు క్రొవ్వాఁడి చేతిం దూఁపు దాడి గా
బంచబాణున కెటువంటి బలిమి యెంత। జయము గలిగించెఁ బాంచాలి జవ్వనంబు

ఉ॥ సింగము లెన్ని పుణ్యములు చేసెనొ యేమితపంబు గాంచెనో
భృంగములుం గురంగములు నేసుకృతంబొనరించెనో నదీ
భంగములున్ భుజంగములు బాపురె ద్రౌపది యంగముల్ బలెన్
సంగతి గన్న వంకఁ గడ చాలఁ బ్రసిద్ధము లయ్యె నిద్ధరన్.

శా॥ కాంపిల్యంబున కెంత కీర్తిగలిగెన్ గాండీవి కెంతశ్చై నై
లింపప్రస్తుత బాహుతేజమల కీలిజ్వాల కెంతయ్యె ని
ష్కంపప్రాభవ మెంతవార్తఁ దగెఁ బాంచాలోర్వి కెంతర్హతన్
సంపాదించెను యజ్ఞసేనుఁడిలఁ బాంచాలీ విలాసంబులన్.

క॥ ఈరీతి వయసు వచ్చిన। నారీతిలకంబు శుభమునకుఁ గాంతేయుల్
రారే వత్తురు దామని। రారే రాయఁడు స్వయంవరము చాటించెన్.

ఉ॥ చాటిన వార్త దిక్కులఁ బ్రసంగవినంబడినం గళింగ క
ర్ణాటక లాట భోట కరహాట వరాట వసుంధరాధి రా
డ్ఘోటము హాటకప్రకట శాటి కిరీట వినూత్నరత్నముల్
పాటిలఁ దాల్చి రాఁదొడఁగెఁ బాటలగంధి వరించు నీటులన్.

సీ॥ కటకంబు చేరి కీకటభర్త పని చెక్కడపుఁ జొక్కటపు మకుటంబు దాల్చె
మకుటంబు గాదని మగధనాథుఁడు ధగద్ధగలీను కుళ్ళాయి తగ ధరించెఁ
గుళ్ళాయి గాదని కొనచుంగు పిడుపుతో ధహళాధిపతి చుట్టెఁ దగడిపాగ
పాగ గాదనుచు లంపాకపాలుఁడు గట్టెఁ జెంగావి సరిగంచు జిగిరుమాలు
మటిరుమాలువు గాదని మత్స్యనేత। చెంపసిగఁ గెంపు తాయెతు చేరఁ జేర్చె
గొరసిగ మానినెరి సేసకొప్పుఁ బెట్టె। మొగిలిరేకులు ముడిచెఁ గాఁభోజవిభుఁడు.

సీ॥ భోటభూభుజుఁ గాంచి లాటభర్త లలాటపట్టిఁ గప్రపుఁ జుక్క బొట్టు పెట్టెఁ
జుక్కబొట్టండంబు చూచి కాదని త్రోచి రేఖమిఱి విభూతిరేఖ దీర్చె
భూతి యేతిరంచుఁ బోనిచ్చి పన్నీట నామంబు పదనిచ్చి నాభిఁ దీర్చె
నాభి నామము పుచ్చి శోభిల్లు మృగనాభి కలికపోలిక తిలకంబు దిద్దె
నీటు మీటాయెఁ బాంచాలి నిను వరించు। నంచు రాకొట్టు డట్టు మోమద్దెఁ జూచి
యట్టులైనను భట్టి నాకట్టువర్గ। మిక్కడనె యిత్తుననుచు నీటెక్కు సలిపె.

శా॥ ముష్టిగ్రాహ్య బహూపవీతకము దోర్మూలా చ్ఛపచ్ఛోటికం
బప్తాధ్యాయ సమస్తపుస్తక వృతవ్యాసమ్ము రుష్ణానిమ
త్కాష్ఠాధోంశుక నాగవల్లి తురగస్థపాత్రింజలి స్వస్తియా
శిష్టగ్రామ్య సుధీజనమ్ము చనుదెంచెం దత్పురీవీథికిన్.

సీ॥ ఇప్పుడే తెంచితిరే లెస్సలా మీపురాణంబు విందురారాచవారు
రామవధానికి క్షేమమా సామమాద్యంతముల్ మావద్ద నభ్యసించె
మాఁప్ప్కుఁడే వారిమాధ్వరి పిన్ననాఁడ మునుచెప్పితిమి కాండత్రయంబు
నోహోహో హొ హ కంటిమే హరిన్ మనజనార్దను సూత్రపాఠ మెందాఁకవచ్చె
నారసింహయపేరిటి నడిమివాని। వడుగు చేసితిరో లేదొ పడుచు పెండ్లి
వింటిమేకద యనుకొండ్రు వీథిఁజేరి। యుత్సవముఁ జూడవచ్చిన యూళ్ళద్విజులు.

సీ॥ దట్టంబుగ నిటలపట్టిఁ బట్టియలుగాఁ బెట్టిన తిరుమణుల్ పేటులెగయ
గట్టిగాఁగఁబ్రపన్న కట్టుగాఁగట్టిన శీర్షంపుఁదిరుముడి చేలలెగయ
మడకతోఁబట్టు పచ్చడపుఁ గప్పలలోన జగ తిరుమణిపొడల్ సందడింప
నొకచంకఁ దిరిపగూడొక బుజంబునఁ దివాసానిన ముదిపిళ్ళ డంటినడువ
నళఘుసింగరి యుప్పళియప్పయాళు। వారుభట్టరు పాటరు వడఘునంబి
యప్పగా రాదిగాఁగల యఖిలదేశ।వాను లాచార్యపురుషులు వచ్చిరచట.

క॥ పుంసమిన్స్కారించిన। వడితోఁ జేయూఁది శ్రీనివాసయగారే
యడియేనని యొండొరులుం। బడి రయగాం డ్రసలు పెంటపట్టన కచటన్.

ఉ॥ చేదలిరద్దముల్ గొనలఁజేరిన వెండికడెంబులున్ సొడల్
పాదములున్ నొసల్ పసపుపట్టెలు వీనుల లక్కయాకులున్
బాదుకొనంగఁ బుట్టములు భాసిలఁబ్రోల్గుదువంగ నేర్పరుల్
వైదికజాతి ముత్తయిదువల్ చనుదెంచిరి ప్రోలుచేరఁగన్.

ఉ॥ జెట్టియు బక్కగొల్లయును జేటికలిద్దఱు బంట్లు నెత్తిపైఁ
బెట్టిన బోనపుట్టికయుఁ బెంచినదాదియు మైలసంతఁగొ
న్నట్టిహయంబుపై యరుసునప్పల బాపనవెచ్చగాఁడు రాఁ
జుట్టపు రాచపల్లకులు చూడఁగవచ్చె నృపాలువీటికిన్.

చ॥ పసపిరుపూఁత మోమిరచ పట్టుపటంగము చీరగట్టి తాఁ
గసిబిసి యమ్మకమ్మనకుఁ గానివిజాళ్ళ నమల్పొలంతితో
నసిమి బుజంబుపై నిసుపునాని కటీతటిఁ గూనలమ్మకో
కెసఁగిన కట్టుగట్టి యొకయింతి నడంగని రూరఁ గోమటుల్,

ఉ॥ ఎద్దులఁజూచి మెచ్చుటల నిద్దఱుముగ్గురు నవ్వులాడుచో
గ్రుద్దుల గుంటుపోక కొఱకుఁ బసయొట్టుల జొన్నదుక్కిలోఁ
సుద్దులసుద్దపుం బరువుఁజూపుటలం బెడమాటచల్దులన్
గద్దఱికోడెరెడ్లు నడగాంచిరి గంజిమడుంగు రింగులన్.

ఉ॥ కట్టిన పెద్దపుట్టములు కమ్మలతోఁబడి కేల్గళంబులం
గట్టిన పైఁడిపాదములు గన్పడభర్తల నింటవద్దనే
పెట్టి తనూజుఁడల్లుఁడును బెద్దఱికంబున కంటివెంటరా
దిట్టలు రెడ్డిసాను లరుదెంచిరి పుక్కిటి వీడియంబులన్.

ఉ॥ నట్టువముట్టుకాండ్రు కెలనంబొరికుండలు పువ్వుదండలున్
బట్టిన బూదిగిన్నియలు పళ్ళెరముల్ పయిగంటుమగ్గపుం
బట్టురువారమట్టు శివబాపనతండము దండఁ గోఁడెకాం
డ్రట్టునిటున్ బరాబరుల నగ్రమునం దతికారులేగఁగన్.

శా॥ వీణానద్ధ విశుద్ధయాన మసకృద్వీటీద చేటీసుతాం
సత్సుణ్ణాత్మకరంబు పశ్చిమచర స్వస్వర్ణ సంధాయకా
ధ్యక్షానీత భటార్భకంబు జననీతాలక్రియం బర్థ
వన్నిక్షేపంబు దిగంతదేవగృహ గాణిక్యంబు చేరెంబురిన్.

శా॥ లంకారాజ్య ధురంధరాభిముఖ లీలాభాష్య కృద్భవ్య ప
ర్యంకాభోగశయా శయార్పిత గదాహంకార నిర్భిన్న ని
శ్శంకాతంక విశంకటాసుర శిరస్సంయుక్త ముక్తామణీ
పంకానద్ధ కిరీటపాటన పటుత్వాశాయుధా శాంబరా.

క॥ విట్కింఖాణ ఘృణీ ప్రావృట్కాల పయోదరచిత వేణువినోదా
చూట్కిడుత నాచమాముఖ। నిట్కిముక సకలసుకవినికర చకోరా.

పంచచామరము॥ మరుద్వృతా సుధాప్రవాహ మధ్యహృద్య మందిరా
మరుద్వృథా విరోధకృద్వి మర్దనాసికుర్దనా
గరుద్రుథాతుకార్థ బద్ధగంధ వాహనా
గురుద్రుథార్మికాప్తగుప్త గోత్రజైత్రకీర్తికా.

గద్య॥ ఇది శ్రీమద్రామభద్రభజన ముద్రకవి పట్టభద్ర కాద్రవేయాధిప వరసమాగత సరస సారస్వతలహరీపరిపాక కాకమాని ప్రబోధ బుధకవిసార్వభౌమపౌత్ర రామలింగభట్టపుత్ర కౌండిన్యగోత్ర భాగధేయ మూర్తి నామధేయ ప్రణీతంబైన పాంచాలీపరిణయంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

# పాంచాలీపరిణయము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీరంగధామపోషిత। సారంగలలామ చక్రశంఖప్రేంఖ
ద్ధోరంగసీమకమలా। నారంగఫలామలస్తనన్యస్తకరా.

వ॥ అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

శా॥ గాంధారీతనయాగ్రణీరచిత లాక్షాగేహ భూహవ్యవా
ట్సంధింజిక్కక యేకచక్రపురి భిక్షాదీక్షసంసార దు
స్సింధుండాటి ధరాసురాకృతులతో శ్రీసత్యవత్యాత్మజా
జ్ఞం ధర్మానిల శక్రభూముఖులు పాంచాలోత్సవోత్సాహులై.

చ॥ అలఁతియరంగుముంజవికె యావపుబూడిద పూఁతకోఁత పెం
కలము దురందునిండు ఘటికాక్రియధాన్యపుఁ గువ్వలాసనం
బులు గొఱెతోళ్ళు జాగిలపు ముంగిలిచట్టులు చట్టిమూఁతలుం
గలుగు కులాలగేహము ప్రఘాణముచేరిరి పాండునందనుల్.

క॥ అట్టియిలుకాఁపుఁ బాడగని। సెట్టీ యీపూఁటకిట వసించెదమిమ్మా
పట్టని యచ్చటఁగుంతిని। బెట్టి నృపులుచనిరి ధరణి భృన్మణిపురికిన్.

వ॥ చనిచని పలుచని రాచనిలయంబులు దెలుపని వెలిపాళెంబులు గడచి వడచిక్కు లడంచిన జడ చిత్రవర్ణ పర్ణతూర్ణ రతగపతగక్షత గాత్ర శతపత్ర కులముకుళ వికలితాకలితాభినవ సౌరభ సౌభాగ్య నభస్వద్విభవ పరాభవ విభావిత భామినీరతిశ్రాంతి భారంబగు పరిఘాపారవారంబు విడిచి యరాబులోనడిచి ధరాసురాంబుద నికురుంబంబు వెంబడింబడి యంబడరిన యంగడియంగడిం గడుపింగడించిన కాంచన చరణపట్టాంబర డంబర నూతన కేతన చామరస్తోమ రమణీయమణితోరణ వారణ జపాకిసలయప్రసూన నానావితాన కాయమాన వితానంబు లవలోకించి కించిదవకాశ రహితప్రవేశ కురుకుకురుకాశ కరూశ కోసలాది దేశాధీశ సేనాబంధుర స్కంధావారంబులు చేరి తదీయ భూరిభేరీ శంఖపణవ కంఖాణాది పుంఖానుపుంఖ విశృంఖల ఘోషణాశేషమానుష కోలాహలంబులచేత నూటాటు సంతలేకీభవించిన భంగివెయ్యారులుసైయేరులు దెంచుకొన్న తెఱంగునసప్తమంధరమథిత సకలసాగరంబుల చందంబున. ఘూర్ణిల్లుచున్న ప్రజంగాంచి యన్యోన్య చిరకాలదర్శన కృతప్రణామోపగూహనంబును బరస్పర బంధువృత్తాంత ప్రహృష్టంబును హరిద్రాముద్రిత

పరిణయపత్రికాపఠన కంపితోత్తమాంగంబును గగనయంత్ర విలోకన నిటలతటఘటిత ప్రసృతిపాణియు నిజసహచర సుహృద్వియోగ ముహుర్ముహుర్బాహుతలాహ్వాన పాదాంగుష్ఠదీర్ఘోత్క్షిప్త దాశావలోకియు శ్రవణరాహిత్య హస్తమస్తాభినయ వార్తా ప్రవర్తకంబును ద్రౌపదీ కృశోదరీ దర్శన వసంతసమయా వ్యథారథాంగాప్తావ లోకనా కులంబును బాంచాలీ సమాగమన కాలక్షేప నిజనివేశ పౌనఃపున్యగమనాగమన కేవల వలమానమానసంబును నైన మానవసంఘంబునడమం జొచ్చి సమీహిత సమీప సమీచీన చీనాంశుకాంచల సంస్పృష్టిమాత్ర సంతుష్టచిత్తులను వృత్తవక్షోరుహాముఖ క్షణదాధ్యక్ష వీక్షణ క్షణక్షత క్షణక్షణ క్షుత్పిపాసాక్లేశులను నిర్దయ సమ్మర్ద మధ్యమిథ్యామధ్య హాస తుల్లటాకులస్థల కులవిమర్శి దూరదర్శి విపశ్చిద్విటులను ననేకహాయనంబుల కగపడి యొండొరులం గొంగులాడిసి వ్యవసాయ వ్యవహార ఋణవ్యాజంబుల కెమరుపలుకులం గొట్టులాడు నాగ్రహారిక గ్రామణులను గాలుమెట్టుటకుం గేలుదట్టుటకుం జీరబించుటకుం గేరడించుటకు నిష్టంకించి ముష్టాముష్టిఁ గచాకచిం గలహించువారల వహించుకొని చేపట్లకుం బూసు జానపదులును బడుగు రైదుగు రత్తఱి నుద్దులై పిడిగ్రుద్దులాఁటకుఁ గాలుద్రవ్వు నితరేతర తృటితోపవీత జానుతలాంగుళీ పంచకసంచర దుష్టపరిభ్రష్ట పరిణయా ష్టాదశవత్సర మత్సరభూవియచ్చర వత్ససముచ్చయంబులనుజూచి నగుచు సవ్యసాచిముఖులు కృతహోమధూమ ప్రకాశంబు వినిర్మితయంత్ర మత్స్యంబు గంధాక్షతమాల్య సమర్చిత పంచకాండ ప్రకాండ కోదండ దండంబు చతుస్సీమా పరివృత కుసుమవాసనాలంకృత సర్వసర్వంసహాధిప విరచిత సమంచన్మంచ సంచయంబు పాంచాలగోత్రాకళత్ర వేత్రధారాదూర నివారిత మనుజవ్రజంబు మహారాష్ట్రభటభుజాలంబి చర్మభస్త్రికా శస్త్రపన్నీర ధూతధూళీపాళీభరంబు క్రమసామ్రాణిధూప ఘుమఘుమాయమానంబగు రంగప్రదేశంబు ప్రవేశించి రంత.

ఉ॥ ముక్కరఁబెట్టి గట్టి మురుముంజి చౌకారపు ముత్తియంబు చే
ర్చుక్క యమర్చి చెక్కులను జొక్కపుపంజుల కమ్మలుంచి య
మ్మక్కన మీఱుమేలు కడియమ్ములు గొమ్మని వ్రేలిపచ్చరా
చెక్కడపుంగరంబు దయచేసి తనూభవఁదల్లి వంపినన్.

గీ॥ తెలివఱ్ఱై దండయంటి యందియలు మ్రోయఁ। గంకణకరాబ్జహతిఁగాంచి గజ్జుమనఁగఁ
గచభరకుచావలగ్నముల్ కంపమొందఁ। గంబుకంధర యంతఃపురంబు వెడలి.

సీ॥ పాదముక్కాటి పట్టుపరపుపైఁ బవళింప మెట్టికపై యంఘ్రి మెలఁతమొత్త
నవటుపై నెరుగూఁత హస్తతలంబొప్పఁ గడముకేల్ విరిబంతిఁ గొఁగిలింప

నొకకపోలముసఖి సూక్తికిఁబనియాన నొకచెంప మకరిక కొండఁబడంగ
డాచూడ్కి ముకురతటంబు పైనటియింప వలచూపు చేమోడ్పుచెలువఁబిలువ
నడిమిసావడి కొక్కింతపడమరంట। చక్కిచిక్కొప్పుతుదపనుల్ నిక్కుచొక్క
టంపు లేకాంతసౌధంబు టాకులోన। యువతి పాంచాలి కొలువున్నయవసరమున.

ఉ॥ గల్లతటంబునం జెమటగ్రమ్మ పుటాపుటి బోటివచ్చి యో
పల్లవపాణి నిన్ బిలువఁబంపిరి నన్నిట రాజుగార నం
జల్లకియెక్కి యా కొరకొమారిత గొల్లలు సౌవిదల్లులున్
జిల్లరదాదు లూడిగపుఁ జేడెలు చెంతల సందడింపఁగన్.

ఉ॥ కట్టలుకట్టలై తనదు కట్టెదుటన్ జయవెట్టి పాటనల్
పెట్టెడుసొమ్ముపెట్ట కొరబిడ్డయి పుట్టుటకున్ ఫలంబు నెం
దిట్టి యొయారమిట్టి యొఱపిట్టి గభీరత యిట్టి రాజసం
బిట్టికుమారిఁగంటిమె మహి న్నహియంచు రహి న్నుతించఁగన్.

క॥ అల్లనఁజని రంగస్థల। మల్లంతటఁ గాంచికాంచి కాంచితఘంటా
వేల్లన్మణి కటికార్భట్లి। బల్లకిడిగి పల్లవోష్ఠి పదచారిణియై.

సీ॥ బెత్తమొత్తి రుమాలు బిగివెన్కఁగట్టిన హెగ్గడుల్ పైకైవార ముగ్గడింపఁ
గడవన్నెయడపంబు గట్టిసావడచెక్కి శుకవాణి తెలనాకు చుట్టియొసఁగ
దోర్నాల రుచితటిద్ద్యుతులు తోరణకట్ట రమణులిద్దఱు చామరములువీవఁ
గంకణపక్వ నిక్వణము జక్కిణిద్రొక్కఁ గరటియాన యొకర్తు సురటి విసరఁ
బిక్కటిల్లిన చనుకట్టు బిత్తఱింప। మొయిలరిగ లిందుముఖు లండనొఱసిపట్టఁ
గడమ యుడిగంపుఁబడఁతుకల్ కదియ నరుగు। దెంచెఁ బాంచాలిరంగప్రదేశమునకు.

సీ॥ నెఱిపెట్టికట్టిన నిండుచెంగావిపైఁ గాంచికాఘంటికల్ కళవళింపఁ
గులుకుగుబ్బచనుంగు కొంగులోహారాళి లేమౌక్తికంబులు లెక్కకొదవ
వెలలేనిసీరు కెంపులకమ్మపంజుడాల్ తేటచెక్కులఁ బిల్లదీపులాడ
లలితసీమంతలలంతిమణిశ్రేణి వేణిశ్రోణీభర క్షోణిగునియఁ
బాణినింద్రాణి కడియంపుటాణిపాణి। ముత్తియంబులు వెన్నెలమొలకలెత్త
మట్టియలుమ్రోయ నూతనసామ్రాజ్యలక్ష్మి। రమణి రాణించె రమణీయరంగధరణి.

క॥ రాజు ద్రుపదుండు రాజద్రాజన్య సమాజముల యథాస్థానములం
దేజమునఁ నుంచి వారలఁ। బూజలుగావించె సదయపూర్ణ హృదయుఁడై.

గీ॥ అప్పుడొప్పులకుప్ప కకుప్పవిభులఁ। దప్పకంటఱ ప్రభులఁ గందర్ప నిభులఁ
గొప్పకన్నుల తెప్పలు విప్పికనుచు। నిప్పపూదండఁ గొనినడల్ గుప్పళించె.

క॥ గంధవహ సఖసమీపగ। గంధాక్షత పుష్పధూప కల్పిత పూజా
బంధుర ధనురస్త్రముల సు। ధాంధఃపథయంత్ర మత్స్య మటుచూపివడిన్

శా॥ ఆవేళన్ ద్రుపదాత్మజుండు సహజాహస్తాబ్జమున్బట్టి బా
హావిన్యాసమెలర్ప దిక్పతులతో నాడెన్ దొరల్ వింటిరా
యీ విల్లెక్కిడి యెవ్వఁడేని గగనప్రేక్ష్యోచ్చలల్లక్ష్యమున్
రీవిన్ బంచశరిన్ హరించినయతండే భర్త యిక్కొమ్మకున్

శా॥ బాహాస్తంభ విజృంభమాణ బలశుంభత్కీర్తికిన్ జాపవి
ద్యాహంకార పరాక్రమక్రమణ దక్షారాతికిన్ ఖ్యాతికై
యాహా నేఁడిదె కేల విల్లుగొని లక్ష్యంబేసి పాంచాలిఁగొన్
బాహూత్పన్నన కిట్టిచో నుడలు డాఁపంజెల్ల దొక్కింతయున్.

మ॥ అనియాసల్ గనిపించనాడి ప్రభుచర్యల్ గాంచి పాంచాలి కి
ట్లనుదిగ్దేశ మహీశకోటి భవదీయఖ్యాత కళ్యాణ ద
ర్శనవాంఛం జనుదెంచెఁ గాంచితె జరాసంధాంశు మద్భ్రా సుయో
ధన దుశ్శాసన శల్యసాళ్వముఖ నేతల్ వీరు శాతోదరీ.

మ॥ ఇతఁడంగేశుఁ డితండు కేరళవిభుం డీరాజు చేదిక్షమా
పతి వీఁ డాహవదోహలాంహిప మహాబాహాకతోరాసి ఖం
డిత ఖండేతర గర్వధూర్వహుఁ డీనేపాళుఁ డారట్టక
క్షితిపాలుండు విలోకనీయుఁడు సుమీ శీతాంశుబింబాననా.

శా॥ ఏరాజుల్ సరిసాటి సోదరశతం బిర్వంకలం గొల్వఁగా
రారాజు న్మరిచీరికింగొనఁడు నీరంధ్రాప్త సంపత్కళన్
రేరా జన్వయకర్తగాఁగల కులశ్రేష్ఠున్ గళాకోవిదున్
రారాజుం గనుగొంటె మానధనునిన్ రాకేందుబింబాననా.

శా॥ అర్ణోరాశిఁ దృణీకరించి వెలిచెట్టట్టిట్టు గావించి దృ
క్కూర్ణస్వర్ణ పదాంగద ప్రియసఖుం గద్దించి యుద్దామ సం
పూర్ణోదారత నీడుజోడుగనఁ డీభూలోకచింతామణిం
గర్ణుంగంటివె వర్ణనీయుఁ డబలాకర్ణాంత నేత్రోత్పలా.

సీ॥ కాంభోజ భూభర్తఁ గంటివా కమలాక్షి వరహయారోహ రేవంతుఁడితఁడు
కాశ్మీరమహికాంతుఁ గంటివా కంజాస్య కుంకుమపంక భోగాంకుఁడితఁడు
గాంధార ధాత్రీశుఁ గంటివా గజయాన సప్తతంత్రీవాద్య చతురుఁడితఁడు
గౌళధరాధ్యక్షుఁ గంటివా కనకాంగి సంగీతవిద్యా ప్రచండుఁడితఁడు

కుంతలాధీశుఁ గంటివా కుందరదన। వదనఘూర్ణితపూర్ణిమా వరనఖేందు
మందగమనా ద్వయీయా ధూయమానచమర। వాలహేలాచల త్కచవ్రాతుఁడితఁడు.
క॥ అహిత మహీతలధవజవ। సహితాహవ మహితబాహు జయధూర్వహునా
గ్రహగహన దవదహనుని౯। మహామహునిఁగంటె వీనిమహీశాదహళు౯.
సీ॥ అకళంకవరపంక హరిణాంకహైమాంబు గంధసారము వాఁడు సింధునృపుఁడు
నృగణాభినుతశోభి మృగనాభి శాదంపు గీరునామము వాఁడు కేరళుండు
ఫణిబృందకురువింద మణికుండలయుతంపు సీగతాయెతులవాఁడు మగధరాజు
కటిబద్ధపరిశుద్ధ పటనద్ధకాంచన త్సరుకటారము వాఁడు దహళనృపతి
మంజుహురుముంజి ముక్తానురంజిచరణ। కంజమంజీర రుచివాఁడు కాశమహిప
కుంజరుఁడు మంజులామోద వంజులాగ్ర। కబరికావిభ్రమము వాఁడు గౌళుఁడబల.
సీ॥ హిమభాను మేనల్లుఁ డితని లావణ్యంబు దలఁచిన మశకమాత్రమ్ము సుమ్ము
శతపత్రదాయాదుఁ డితని తేజంబు ముందరను ఖద్యోతమాత్రమ్ము సుమ్ము
చతురాననబ్రహ్మ యితని పొక్కిటి తామరకుఁ బరాగాణు మాత్రమ్ము సుమ్ము
నిఖిలప్రపంచంబు నిక్కమీతని డొక్క ప్రక్కకు మెతుకుమాత్రమ్ము సుమ్ము
మనుపఁబుట్టింపఁ ద్రుంపసమర్థుఁ డీవి।భుండు పదియాఱు వేలాండు పిండునిండు
మిండతీకమునఁ గడముట్టకుండుమనసు। వాఁడు వీఁడమ్మ యదువంశవల్లభుండు.
సీ॥ అనిరుద్ధుఁగంటివా యనిరుద్ధబలశాలి బాణకన్యా బహిఃప్రాణమితఁడు
బలభద్రుఁగంటివా కలభద్రధీమసారు రేవతీ గుణవతీ జీవమితఁడు
ప్రద్యుమ్నుఁగంటివా ప్రద్యుమ్నకేయూరు రతికథాశ్రుతివిధా రసికుఁడితఁడు
సాంబునిఁగంటివా కంబునిభగ్రీవు లక్షణాబ్జేక్షణాపక్షమితఁడు
సాత్యకియితండు కంటివా సత్యకీర్తి। నర్తకీహస్తగళిత సంతానసూన
మంజరీకారితానంత మండలాంత। తారకుఁడు శౌరితమ్ముఁడో తరళనయన.
గీ॥ అనుచుఁదోడెచ్చరించఁ గన్గొనుచురాఁగఁ।గనివిసియెఱుంగని విలాస గరిమగాంచి
పొచ్చెమించుకలేని యమ్మచ్చెకంటి। యచ్చెరువునొంది మెచ్చెరాజోచ్చయంబు.
క॥ పాంచాలీచంచన్మణి। పాంచాలీ కనదురోజపాళింజోళిం
బాంచాలీ కృతకుకురా। ట్చంచల దృక్చంచరీకచయముచరించె౯.
సీ॥ జడదగుల్కొనుచూపు జలదాంతచంచల యలనవ్వుచూడ్కి వెన్నెలచకోరి
కెమ్మోవిపైదృష్టి కెంపుతో నీలంబు కుచయుగాపాంగంబు కుధరతమము
మెఱుఁగారుపై వీక్ష మిహిరజాంబు చరంబు వలుదపొక్కిలి దిశకొలనికల్వ
జఘనావలోకంబు జగతినాఁటినయమ్ము చరణకటాక్షంబు జలజభృంగి

లోచనానందమొంద విరోచన ప్రభాచణా చక్రవాళా చలాచలాస్థ
లీచలత్ప్రభులతను నారాచమైన। రాచకొమరిత పాంచాలి చూచునపుడు.

సీ॥ కోసలాధీశుండు మీసముల్ దడిగొల్పె నంగిచేతులఁద్రోచె నంగవిభుఁడు
జముదాళిలోఁజేయి సవరించెఁ గురురాజు శకభర్తచౌకట్లు చక్కఁదిద్దె
గౌళభూభుజుఁడు జాగాలకుఁ గైసాచె బంటుపైసురిగె అంపాకనృపతి
చీరంబుతో బిఱ్ఱబిగిసెఁ గాశ్మీరుండు దహళుండు పూబంతి తావిగొనియె
సూరసేనుండు భుజములుచూచుకొనియెఁ। గుంతలములింతయెగదువ్వెఁగుంతలుండు
చంచల దృగంచలములు పాంచాలిఁజేరి। యించుకించుక మీఁదవర్షించునపుడు.

మ॥ ధృతిదూలింపని పార్థివుండు మరుబారింగానిలంబోని భూ
పతి భూషింపనిరాజు భ్రాన్పడని భూపాలుండు చేతోగతిన్
నతిగావింపని మేదినీశుఁ డొకఁడైనన్ లేఁడు పాంచాల రా
జతనూజాతనుజాతసూతన విలాసప్రౌఢి సామాన్యమే.

గీ॥ కలజనంబుల తలఁపులో వలపుగరఁచి। కరుపుగట్టిన బొమ్మ యాకలికికొమ్మ
ముజ్జగంబులుమోహాబ్ధి మునుఁగుటెట్లు। వనితపాంచాలియనిపించుకొనుటయెట్లు.

సీ॥ తులఁదూఁగు మౌక్తికంబులతోడ దంతముల్ లలితగాత్రము కల్పలతయొసంగుఁ
జాలిండ్లువెచ్చించు ధర్మకటాహముల్ ధరదయచేయు నితంబతటము
తిలపద్మములనిచ్చుఁ దీర్ఘైనముక్కు మో మంబరంబుఫలించు నసదుఁగౌను
నతనాభిశోభి పున్నాగంబుగొమ్మను బృథుచామరము సమర్పించువేణి
యెంచఁదగునీవిరీవిఁ దేలించెనౌర। కాకయుండిన ఘనకీర్తిగలుగు టెటులు
పటుకిరీటంబుగల నరపతికిఁగాని। కొంచెగానికి దొరక దీకువలయాక్షి.

క॥ కడుమింటిపోల్కి విడుమీ। నడుమింతయుఁగానరాదు నఖములరేఖల్
నిడుమించు లీనుకన్నులు। నుడుమీనంబులకు నెక్కుడో హెయిచెలికిన్.

క॥ చెవులారఁ బల్కుఁ బల్కుల్। చవులా మకరందమునకుఁ జవులాదంత
చ్ఛవులాహా కుచములకో। కవులావర్ణించువారు కవులాచెలువన్.

శా॥ చంద్రాంతఃపురకామినీమణి విలాసంబుల్ విలోకింప మో
యింద్రాదిత్య భవావరోధమహిళా హేళాకళల్ చూడ మో
సాంద్రంపుం బసిపాపయల్లు నవలాసౌందర్యమీక్షింప మో
రుంద్రశ్రోణులు మందగామినులాయారుల్ సాటియే దీనికిన్.

శా॥ ఒయ్యారమ్ముల యిక్క యిక్కలికి నేత్రోత్పల్ల విద్యుల్లతల్
వెయ్యారమ్ముల కమ్మఖింటిదొరకున్ వెచ్చించుఁ బొమ్మంచులం
బయ్యాడుందల మచ్చుబిబముల సంబాళించుఁ గెమ్మోవి తా
లియ్యాఁడుంపఅమిన్న చన్నుగవతో నీడాగిరీడాపళుల్.

శా॥ అష్టాంగంబులడాలు మేలునగు మోమమ్మక్క దృక్కోణవక్రా
నిష్టాలాపములాడు చేడెసలతో నిష్ఠూర చక్కట్టు హా
ముష్టింబట్టు నడంగు మధ్యమనుచున్ మూర్ధన్యు లర్థించి రా
ధృష్టద్యుమ్న సహోదరీమణికి నేరీసాటి నారీమణుల్.

శా॥ ఈ లావణ్యవతీశిరోమణి తనూహేలాకళావార్థిలో
నోలాడంగలవాని భాగ్యమెసుమీ యోగ్యంబు సాధ్యేతర
ద్యోలక్ష్యం బెడలింపఁగూడనియెడన్ బ్రోద్దామసంచారి భూ
పాళింబోలి మదాళికుంతల వివాహంబౌను మంచుం దొరల్.

చ॥ తటుకున మంచెడిగ్గుదొర దట్టిబిగించఁగఁ జూచు రాజు దు
ష్పటి కటిఁగట్టు పార్థివుఁడు ప్రజ్ఞలు పల్కుచుఁ గార్ముకమ్ము చెం
గటి కరుదెంచి కాంచి విలుకైఁ గదలింపఁగనోడి గుండియల్
తొటుకుతొటుక్కనన్ దిగులుదొట్టిన భూభుజుఁడయ్యె నయ్యెడన్.

మ॥ పటుచాపంబుఁ గదల్చ బెట్లు కదలింపంగూడుఁగా కెక్కుపె
ట్టుట యెట్టెక్కెడుఁగాక యాకసమునన్ డోలాయమానంబుగాఁ
జటులంబైన శరవ్య మేనుశరముల్ సంధించి త్రెళ్లంగ నే
యుట యెట్లంచొక కొందఱుండిరి నిరుద్యోగాత్త చిత్తంబులన్.

మ॥ జవసత్త్వస్థిర సంధిబంధుఁడు జరాసంధుండు గోరంత త
క్కువగా నెక్కిడి యక్కుదక్కఁ బడియెం గోదండ దండాహతిన్
యవమాత్రంబు కొఱంతగా గుణము కొప్పందించి చేజారితా
మవలం ద్రెళ్ళిరి శల్యనీల శిశుపాలాదుల్ ధనుర్ఘట్టనన్.

సీ॥ కఠినకోదండంబుఁ గాంచి దండముఁబెట్టి తిరిగిచూడకపోయె మరువిభుండు
దీనితోఁ గొడవేల పోనిమ్ము రమ్మని లాటుఁదోడ్కొనిపోయె భోటనృపతి
తమపట్టినాకని కీసమకట్టి వశపోని విలువెట్టిరనితిట్టి విరటుఁడరిగె
విలుముట్టనేల రోఁతలుపుట్టనేల యీ యిలమెట్టరాదని యేగెశకుని
చాలుఁ బదివేలువచ్చెఁ బాంచాలిదొరకి। నట్టెకదనేఁడు మనయూరికట్టుగన్న
గుట్టుతోనని తనవచ్చినట్టి తెరువె। పట్టెఘోట్టాణుఁగూడి యారట్టనృపతి.

చ॥ బలదేవాదులు యాదవుల్ పదరినం బాంచాలి కొంచెంపువా
రలకుం గూడదు గూఢరూపముల గోత్రాదేవసంఘంబు లో
పల నున్నారదె పాండవేయులకె లభ్యంబౌ వృథాయత్నముల్
వలదంచున్ వసుదేవసూనుఁడు వడిన్ వారించెఁ జేసన్నలన్.

క॥ నీలశిశుపాల క్షుద్రనృ|పాల జరాసంధలోక బంధురతనూజుల్
చాలించి వెనుకఁదిగిచిన| వేళన్ దివిజేంద్రసుతుఁడు ద్విజసభ వెడలెన్.

క॥ వెడలి కడుఁబుడమి నల్లడ| గడగడఁగంపింపఁ గదలి కదళీకాండం
బౌడియు కరివోలె వలగా| నడిచి నతుల్ చేసి ధనువునకుఁ జేసాచెన్.

ఉ॥ అక్కట దిక్కుటీరనట దాహవతేజులు రాజులెల్ల వి
ల్లెక్కుడ లేకయుండ ద్విజుఁడెక్కుడ కార్ముక కర్మమెక్కుడ
మ్మక్క యితండు విప్రకుల మాఱడిపెట్టె నటంచుఁ గొందఱే
యుక్కును లేక యిట్టిపని కొగ్గునె యంచు చొకకొందఱాడఁగన్.

శా॥ పూర్వాభ్యస్త శరాసముంబలెఁ గరాంభోజంబునం బట్టి వి
ల్మౌర్వీ ధూర్వహనంబు గాఁగ నవలీలన్వంచి పంచాస్త్రత
న్గీర్వాణాస్త్ర శరవ్యమవ్యయగతిం ద్రెళ్ళంగ నేసెన్ సురల్
శర్వాణీశుఁడె యీతఁడంచు సుమవర్షంబుల్ ప్రవర్షింపఁగన్.

శా॥ వీనింగన్నది తల్లి గాక నరుఁ డుర్విం బుట్టినం జాప వి
ద్యానైపుణ్యము లిట్టులుండవలదా యౌరా రా భుజాగర్వ మా
హా నిశ్శంకధృతిన్ సతేజుఁడు ద్విజుం డాభూభుజుం డంచు న
చ్చానం గాంచు వియచ్చరోచ్చయము మెచ్చంజొచ్చె వివ్వచ్చునిన్.

ఉ॥ ఎంతటివన్నె దెచ్చె గుటిలేసి యితండు ద్విజన్మజాతికిన్
వింతయటంచు రాజులగణింపక తిట్టుచు గేలిగొట్టుచున్
గంతులువైచుచుం దలకుఁగట్టిన చెంగెగవైచి పట్టుచున్
గొంతులురాయఁ గోయనుచుఁ గూఁతలు వెట్టిరి గ్రామ్యభూసురుల్.

క॥ మనలో మనమిటు పోరిచూ|పున నుండిన నుంటిమేకముగ నుండినఁ గుం
భిని యేలమెయని భృగురా|మునిఁ దిట్టిరి శ్రోత్రియోత్తములు ముంగోపుల్.

ఉ॥ ఆసమయంబునం దజహయాసమయాన యొయారిరంగ సం
వాస వసత్పరిసన్నముఖువాసవసంభవు సాయకాసనా
భ్యాస నవప్రభావ వృషభాసన శాసనవాసనాభరున్
బ్రాసవదామకంబు మెడపైసవరించి వరించెఁ బూజలన్.

శా॥ పాంచాలాత్మజ పాండునందను వరింపంగాంచి మమ్మెల్ల రాఁ
బంచెం బంచినవాఁడు చుట్టముబలెం బట్టిన్ సమర్పింపక
భాగించ ప్పంచలలక్ష్యమేయుమని మాయల్ పన్ని కన్నెం బ్రసా
దించె న్విప్రునకంచు నాగ్రహమునై దిగ్రాజు లత్యుగ్రులై.

శా॥ రాజన్యాధముఁ గొట్టి పట్టణము చూఱల్వట్టి రాజ్యంబు వి
భ్రాజద్వైఖరిఁ గట్టికొన్నఁ గద కోపంబాఱుఁ బాఱుండు దో
స్తేజం బేఁది తలోదరింగొనియె భూదేవుండవధ్యుండు ని
ర్వ్యాజుండే లతఁడుండ నిమ్మని రణవ్యాపార మేపారఁగన్.

క॥ పాంచాలరాజుఁ గదిసినఁ। జంచలపడి యతఁడు విప్రసభ మఱుఁగుచొరం
గాంచి ద్విజకోటి నిజబా।హాంచిత దండంబులెత్తి యనికిం దొడరన్.

ఉ॥ కవ్వడి నవ్వుచుంబలికెఁ గాంచనగర్భ కులోద్భవాళితోఁ
జివ్వలుమీరు సాఁపుకులె శిష్యునిఁ జూడుఁడు క్రొవ్వెదల్విడన్
జివ్వెదఁ గ్రొవ్వెదంగల యశేషవిరోధుల యీశిరోధులన్
జివ్వకుఁ జువ్వరించు ననుఁ జెంతలఁ గన్గొనుఁ డండయుండగన్.

క॥ అనికాంచి యనికిఁ గొంచక। చనుదెంచిన కురుబలంబు శతమఖజుఁడు వి
ల్గొని నిలిపెం గోపాటో।ప నటత్ఫణిబృందమునకు బదనికవోలెన్.

క॥ గాండీవి మొనసి చండిమ। గండిమవిక్రమమువాఁడు గాఁడనఁగా ను
ద్దండతరువెత్తి మారుతి। దండధరుండనఁగ దండవాఁ గ్రానునంతన్.

క॥ బలభిన్నందనునకుఁ గురు।కులతిలకున కపుడు పోరు ఘోరం బైనన్
దలపడఁకఁ బఱచెఁ బరచయ। మెలుఁ గెఱుఁగుల్ జేసి రెడ్డియెఱుఁగునటంచున్.

శా॥ తాలోత్తాల ధనుర్ధరుఁడు నరుడండంతం జెంత నేతెంచు దో
స్సాలాంకుండు మరుత్తనూభవుఁడు లక్ష్యంబేసినం బోవు న
ప్పాలాశాంగుఁడు ధర్మజుండు కవలప్పార్శ్వానుగుల్ సమ్మనం
బాలధ్వంసకు శీతలోక్తికలరెం బాలధ్వజుం డయ్యెడన్.

క॥ త్రిజగన్నుత బలమాద్య। ద్భుజునకు దుశ్శాసనునకు ద్రుపదసుతునకున్
విజయునకుఁ గర్ణునకు వా।యుజునకు శల్యునకు ద్వంద్వయుద్ధంబయ్యెన్.

మహాస్రగ్ధర॥ నరుదాఁకెం గర్ణుఁడంతం దరణితనయునిం దాఁకె గాండీవి తద్ధు
ర్ధరదోర్దండాగ్రజాగ్రత్కృతినధనురితాస్త్రంబు లభ్రింబుగప్పెన్
నరుండొప్పెన్ శౌరిరొప్పెన్ ఖగములవిడుపుం దప్పెనప్పార్థుకుస్వ
చ్ఛరధారల్ చేరివారింపఁగవసమరి భాస్వత్తనూజుండు పల్కెన్.

శా॥ అంభోజాప్తతనూజుతోడ ననిసేయం గార్తవీర్యారి దో
స్స్తంభధ్వంసి పురారివైరి రణవాంఛం బట్టి కేల్గట్టి ము
న్కుంభీసంభవు ద్రోలఁబెట్టిన ప్రవీణుండేమొ యన్యుండు త
ద్గంభీరాస్త్ర నిపాత మోర్వఁగలఁడే ధాత్రీబుధగ్రామణీ.

ఉ॥ నీజగవిఖ్యాతినేర్పునకు నీభుజశక్తికి నిచ్చ మెచ్చితిం
జూజయశీల నానరుఁడు సూతజ చెప్పిన వారిలోన నే
రాజనుగాను విప్రుఁడడు రానకు రాజనటన్న నగ్రభూ
తేజమజేయమంచు సవితృప్రియనందనుఁ డేగె పెన్కకున్.

సీ॥ అనిలనందనుఁడు శల్యుని మొగంబై చెట్టుపడవైచి చూరఁబాఱిపట్టుకొనియె
పట్టుపోఁదట్టి యబ్బల్లిదుండల్లటు బిల్లమీఁటినయట్లు భీముఁ జిమ్మె
చిమ్మితౌనని భీమసేనుండు దృఢముష్టిఁ దప్పించుకొమ్మని గుప్పెఁ బొమ్ము
బొమ్ము గ్రుద్దిన నింత సొమ్మసిల్లక మద్రభూభర్త చనుమఱఁబొడిచియార్చె
పొడుపువిడుపును గెంగేలియడఁపు గెడఁపు
నిడుపు గుఱుచల నడుపురా ముడుపులెంచ
జడుపులెంచని తోఁడేటి డుప్పు మేటి
మాద్రియన్నయుఁ బెనఁగి రున్నిద్రపటిమ.

క॥ వడముడి శల్యునిఁ దొడిఁబడఁ। బుడిసిటిపట్టుగను బట్టి పుడమివడఁకన్
బడవైచిన మెడనొడలన్ । గుడిగొను దుమ్మతఁడు తుడుచుకొనుచుం జనియెన్.

ఉ॥ భార్గవుఁడుం గిరీటియును భర్గుఁడె కాకల భానుసూనుతో
మార్గణమేయుచోట మతిమానుసులే బలిభీమసేనుఁడున్
దోర్గతశీరుఁ డొక్కరుఁడె తూఱిపెనంగఁగ శల్యుతోడ నీ
శార్గతి మించిరెవ్వరొకొ యంచు సుయోధనముఖ్యులాడఁగన్.

శా॥ అన్యావాగ్యముత్రైన కార్యములు చేయంబూని పాంచాలరా
ట్కన్యారత్నముఁ బత్నిగాఁ గొనియె లక్ష్యంబేసి యీభూసురుం
డన్యార్థంబులు మానిపొండనుచుఁ గంసారాతి వారింప రా
జన్యానీకము లంతట న్నిజనివాసక్షోణి చేరెందగన్.

క॥ అట్టిహరిపట్టి కోలం। దొట్టున యంత్రంబుపడిన దొరలాత్మధరల్
మెట్టిరి పుణ్యము చెల్లిన। పట్టునను డుఱాజి పుడమిఁబడిన కడంకన్.

గీ॥ అక్కముక్కర పదిలమోయమ్మకమ్మ! యొ[illegible] గవదకట్టింతగిట్టు
బొట్టుజతనంబు ననుజంకఁ బెట్టుకొమ్ము! [illegible]ంయు నడిచిరి చేడెలెల్ల.

మ॥ వనజాక్షీకుచఘర్షహర్షరస [illegible]కాం
చన భూషాహృతి గూఢసంచర [illegible] బశ్వాభి
స్వనదన్యోన్య తనూపగూహనవలత్సంస్కారి సమ్మిశ్రమ
జ్జన సమ్మర్దము మద్దళాద్యసిన దాస్పష్టోక్తమిష్టార్థమే.

శా॥ ఈపాళెంబున నిత్తమింతయన మీరే వైష్ణవుల్ నేఁటికిన్
బాపావాదులు తత్త్వవాదు లదయుల్ పాపాస్వయంపాకమే
లా పల్లెం గలదన్న మందరుబుధుల్ యజ్వల్ విధూతక్షుధన్
జేజే చేరెద మూఁకంచుఁ బ్రజజాతిన్ విచ్చు మొగ్గైవడిన్.

చ॥ విభవములెల్లఁ జూచితిమి వేడుక దీఱె దిగంతరాగత
ప్రభునికరంబుఁ గాంచితిమి బత్తెము చెల్లెను గుట్టుతోడ నేఁ
డభిమత మాత్మదేశముల కందఱమేగుటయంచు భూసురుల్
రభస లసద్గతిం దమపురంబులు చేరఁగవచ్చిరంతటన్.

ఉ॥ తెచ్చిన చల్దికూళ్ళతిని తిత్తులబియ్యము గార్చి కాసులున్
వెచ్చ మొనర్చి వక్కలును వీడెము చేసియుఁ గోకమాసియున్
వెచ్చనినీళ్ళవాసి పొదివేసియు జానపదోచ్ఛ్రయంబు నూ
న్వచ్చిన యబ్బువోఁ దిరిగివచ్చె హుటాహుటి నూళ్ళు చేరఁగన్.

క॥ ఆక్షణమునఁ జనిరఁట లబ్బు।భుక్షుతనూభవులు ద్రుపదపుత్రీమణితా
భిక్షాశన దీక్షాదళ। నక్షమ నిజభాగ్యలక్ష్మి నావెనుదగులన్.

శా॥ కావేరీసరిదంతరాళ పులినక్ష్మామధ్య విధ్యంతరా
ధ్యావాసానత కృత్తివాస కృపణార్తత్రాణ లోలాను కం
పావాలా తపనీయచేల రవిచంద్రాబ్జాలయాలంకృతే
క్షావక్షా సరసీరుహాక్ష గజరక్షాదక్ష దీక్షానిధీ.

క॥ ధైవతకులక తీరవ। ధైవతగాంధారతాన తతగానకళా
కోవిదవైరించని నా।నావైపంచి ప్రపంచనమితశ్రవణా.

పృథ్వి॥ జటీకృతపటీపతి స్వప్పుదు సాదపాదచ్ఛటా
విటీకృతఘటీ కుచద్వితయ గోపకన్యాఘటా
ఘటీకృతఘటీ కవత్పతి విధాతృసంధ్యానటా
నటీకృతపటీరజిన్మధు బిభేదకీర్త్యుద్భటా.

గద్య॥ ఇది శ్రీమద్రామభద్ర భజనముద్ర కవిపట్టభద్ర కాద్రవేయాధిప వర
సమాగత సరససారస్వతలహరీపరిపాక కాకమాని ప్రబోధబుధకవి సార్వ
భౌమపౌత్ర రామలింగభట్టపుత్ర కౌండిన్యగోత్ర భాగధేయమూర్తి ప్రణీ
త మైన పాంచాలీ పరిణయంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

# పాంచాలీపరిణయము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీరమణీ హీరమణీ । హారమణీయాగ్రనఖర భరితకపోలా
భూరితర భూరిచేలా । శ్రీరంగవిమానశయన శీతలనయనా.

వ॥ అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

మ॥ తులసీమృత్తిలకక్ విశుద్ధదశనక్ దోరంగుళీ కాశికా
స్థలముద్రాంకిత తామ్రముద్రికఁ బ్రభాతస్నాతఁ బశ్యాల్లగ
త్ఫలితశ్యామశిఖక్ బురాతన పరీతక్షౌమ లంబశ్రవ
శ్చలవర్ణవ్రతతంతుఁ గుంతిఁగని వాంఛక్ మ్రొక్కిరంతక్ సుతుల్.

వ॥ మ్రొక్కి యక్క యొక్క భిక్షంబుఁ దెచ్చితిమనఁ దత్క్షణమ దక్షణదిగ్రక్షతనయా గ్రక్షోణిరాణించు నప్పద్మదళాక్షి మీరేవురు నుపయోగింపుండని పుంగ్రదేశ్రు ధర్మసామ్రాజ్యలక్ష్మి నాఁబశ్చిమతీతి నీక్షింపందగిన యతవిందాక్షిం గటాక్షించి ధర్మభీతయై మాత ధర్మతనూజాతున కిట్లనియె.

శా॥ కంటే కన్యకయా జెఱుంగకయ భిక్షంబేవురం బంచుకొం
డంటి న్నాపలుకింతతప్పకు మదీయాజ్ఞక్ విడంజాల ని
ట్లంటేనక్ ధరనవ్వునన్న యమజుం డయ్యర్జునుంజూచి కై
కొంటో ప్పక్ సతిఁదెచ్చు నీకనుటయుక్ గోత్రారిజుం డిట్లనుక్.

క॥ కొండికవారికిఁ బెద్ద లుటుండఁగ సతిఁ బెండ్లియాడు టుచితమె మీరే
కొం డిందఱియనుమతమిది। యొండొకపలుకేల యనుచు నుండెడువేళక్.

ఉ॥ అండజరాజయాన వదనాబ్జముపైఁ గుచకుంభపాళిపైఁ
గండతలంబుపై వెడఁదకన్నులపైఁ గబరీభరంబుపైఁ
బాండుతనూజపంచక మపారకృపారస మానసంబు దృ
క్కాండమువంచెఁ గంజభవు కట్టడదప్పనె యెట్టివారికిక్.

గీ॥ అటుల చపలాక్షిపై మోహమైనగురికి। నేకమగు బెంచి మనమిందఱిందుముఖి వ
రింత మిది వ్యాసునానతి యింతెయనుచు। నన్నతమ్ములతో నాడునవసరమున.

క॥ ముసలాయుధకరుఁడును మరి। కిసలాయుధగురుఁడువచ్చి కృపఁగనిరి సమి
ద్వ్యసనాభ్యసనారిజన। శ్వసనగ్రసనద్విరసన సమభుజు యమజుక్.

సీ॥ కని యెఱింగించుకొని ధర్మతనయునకును। గుంతికిని మ్రొక్కి భీమఫల్గునులఁ గౌఁగి
లించిమాద్రికొమాళ్ళ దీవించియున్న। రామకృష్ణులతో ధర్మరాజుపలికె.

గీ॥ కుశలమామీకు బాడబగూఢవేష। భావనాలంకృతుల మమ్ముఁ బాండవేయు
లఁట యేరీతిఁదెలిసితి రన్ననగుచు। ధర్మసూతికి నందనందనుఁడు పలికె.

చ॥ క్షత్రియతేజము న్దెలియఁజాలరె ధీనిధులైనవారు భూ
మిత్రిదశాకృతుల్ గుఱుతె మీగుఱుతేయులె తెల్పఁజాలెడిన్
ధాత్రిఁబ్రభూమరేఖలు ధనంజయుఁజూపవె యాధనంజయు
క్షాత్రమె బైలుచేసెననఁగా యమసూనుఁడు హర్షితాత్ముఁడై.

మ॥ కరటింగాంచిన తండ్రివీవ ధృవు రక్షారాహితిక్షీణున
త్తురుఁగాఁ బట్టముగట్టినట్టి యజహత్కారుణ్య పాథోధి వీ
వరిపూర్విన్నరణార్థికిచ్చు దొరవీవా నాఁటికిన్ నేఁడు నీ
గరుడస్యందను నందనందను ఘనుం గంటింగదా మాధవా.

క॥ ద్వారకయెక్కడ ద్రుపదుని। యూరెక్కడ యూరిలోన నొకకడఁ గుం
కారాగారంబెక్కడ। యూరరుదెంచుటకు భాగ్యమేమందుహరీ.

సీ॥ కడుఁజిక్కి యొక్కఁడెక్కడ మొఱపెట్టునోయని యక్కడికేగ దాహాళినీకు
పట్టియెవ్వఁడు బంటుఁగట్టి కొట్టించునోయని యక్కడికేగదా కనికరంబు
రిపుఁడైనను విపత్తులెపు డడ్డపడునోకోయని యక్కడికేగదా యాదరంబు
తలిదండ్రి ప్రాపువో దాసుఁడెంతడలునో యని యక్కడికేగదా యమితకరుణ
తనులతాయాసమెంచెదో తనువుదాఁచు
కొనెదో యాగికిఁగొంకెదో కొసరనిడెదో
కొలువుగొలిచిన మది నమ్మికొన్ననిన్నె
యన్యులఁదలంతురే రక్ష కంబుజాక్ష.

క॥ మాతండ్రిగుఱుతెఱుంగుము। మాతల్లివితండ్రివైన మాధవమాకున్
ధాత్రివు నేతవు హితసం।ధాతవుగద యాదవాభ్యుదయకర హృదయా.

వ॥ అని యని వారితోదితఖనియై కని యాతండు కొనియాడిన.

గీ॥ లక్కఱులుచెంత నొక్కింత మొక్కవోక। పెక్కుసప్రఁగౌరవులనెల్ల లెక్కగొనక
కన్యకై కొంటి రిఁక మేలుగలుగుననుచు। నతనినూర్చి సబలుఁడై యరిగెశౌరి.

ఉ॥ అంతట నందనుంబిలిచి యాద్రుపదుండు కుమారిఁగొన్నవాఁ
డెంతటివాఁడో పేరు కులమెయ్యది యోనెలవెద్దియొక్కొ యా
వింతయుఁ గాంచిరమ్మనుచు వెంటనెపంపినఁ గుంభకారగే
హాంతముఁజేరి వేఁడెలిసి యాతఁడు గ్రమ్మఱి తండ్రికిట్లనున్.

శా॥ వారయ్యుద్ధముఁ గృష్ణఁగూడి ఘటకృద్వ్యాపారులై యొక్కవృ
ద్ధారత్నంబునకుం బ్రణామమిడి రంతన్ భూసురశ్రేణికిన్
గారాతగుండనుపం జతుర్ద్విజులు భిక్షంజెత్తితే నేడ్గునన్
దారెల్లన్ భుజియించి కూర్కిరచటన్ దర్భాజినశ్రాంతులై.
క॥ గోత్రామరులో క్షత్రియపుత్రులో కావలయు నల్ల భూసురవేషుల్
ధాత్రీశ యితరజాతి చారిత్రులుగా రుక్తిరూపరేఖలు చూడన్.
సీ॥ ఇప్పుడా రాజనాలింత మెచ్చని మచ్చికంటికా బిచ్చాలవంటకంబు
పళ్ళెరంబిడులోనై పాడుపత్యము చేయు కలికికాంయుండటి కడలుకుడుపు
చెంగల్వవిరిశయ్య నంగమొత్తుటకులుకు బిబ్బోకరాశి కాదబ్బపాన్పు
మణులయొడ్డాణం బమర్చిన బరువెన్ను కన్నెకాయార్యులు కాళ్ళమోపు
బాత్రురే విధియంచేరుపడని కాపురము విలోకించి పాంచాలిప్రాపుగాంచి
సంచలించెను మామకస్వాంతవీధి। చెలువభాగ్యంబు దేవరచిత్తమధిప.
శా॥ అంచుంబల్కఁ బురోహితుంబిలిచి జాత్యాకృత్ విచారించి ర
మ్యంచుంబల్కిన ధర్మజుంగని యతం డాశ్చర్యచర్యత్ తనే
యాంచద్రూప మెఱింగివచ్చి ద్రుపదక్ష్మాధ్యక్షుతోఁ జెప్పినన్
జంచద్ఘోట రథంబు తేర్పఱచి ధృష్టద్యుమ్నుఁ దోడ్తెమ్మనన్.
ఉ॥ ఆతఁడు తీవ్రయత్నమున నచ్చటికేగి పరేతరాట్తనూ
జాతుఁ గాంచి యానృపుఁడొసంగు సపర్యలకుబ్బి పార్షద
క్ష్మాతలనేత రమ్మనిన చందముఁ జెప్పిన మాతృభామినీ
భ్రాతృపరీతుఁడై నగరిపజ్జకు వచ్చె రథాధిరూఢుఁడై.
మ॥ అలఘుప్రాస శరాసధారుల యుగవ్యాయామ బాహాయుగా
ర్గళులన్ లోహకవాటగాఢతర వక్షఃపీఠవై శాల్య ని
ర్మలరేఖాఘనులన్ ఘనాంగ సుషమామాహాత్మ్యములం బాండవే
యులఁ బాంచాలుఁడు చూచి బాహుజులెయం చూహించె నేతేరఁగన్.
క॥ చనుదెంచి యిటులు కుంతీతనయులు తనయొద్ద రాజతనుజోచిత పీ
ఠిని నిశ్శంకతఁ గూర్చుండినవారికి ద్రుపదుఁడిట్లనియెఁ బ్రియమెసఁగన్.
శా॥ అయ్యా మీరలు బాడబాగ్రణులో బాహాజన్ములో ద్రౌపదిన్
దియ్యంబోడి వరింపఁగా వసుధకే తేఁజూచు నాదిత్యులో
మీయాచం గులగోత్రముల్ తెలియ కీమీనాక్షి నుద్వాహమేఁ
జేయంజాలనటన్నఁ బాండుతనయ జ్యేష్ఠుండు తానిట్లనున్.

ఉ॥ ఇయ్యమకుంతి ధర్మజుఁడనే నితఁడగ్ని సుహృత్తనూభవుం
డియ్యన యింద్రసూనుఁ డలయిద్దఱు మాద్రికొమాళ్ళు మున్నమా
యయ్యను పాండురాజనఁగ నారసినాఁడవె యివ్విమాకతల్
వియ్యములియ్యఁకానా పనిలేదొ తలంపుఁడుమాటలేటికిన్.

క॥ అనిపలికినఁ జెవులకు సుధ। గనిచినికిన యట్టులైనఁ గాంపిల్యవిభుం
డనుమోదలహరి విహరిం। చెను హరిహరియనుచు వారిసేమము గనుచున్.

క॥ లక్కయిలుదక్క నొక్కరుఁ। జిక్కక యిక్కుంతితోడఁ జేరితి రెటులీ
దిక్కనకని ధర్మజుచే। నక్కథవిని నిందచేసె నక్కురురాజున్.

క॥ ఈజాడనతఁడు సైరిభ। వాజి వజీరుని తనూజునర్ణిత తేజున్
బూజించి కొన్నినాళ్ళకు। రాజన్యులు కొలువ ధర్మరాజునకనియెన్.

క॥ ఆఖండలనందనుఁడీ। రేఖాఖనికన్యకాబ్జ రేఖానిటలా
రేఖాశిఖామణికిఁ బతి। యైఖేదంబుడఁచె మోదమలవియెపొగడన్.

పంచచామరము॥ స్వయంవరానులబ్ధలబ్ధవర్ణవర్ణనీయ మ
త్ప్రియాత్మజాత నర్జునుండు పెండ్లియాడువాఁడనన్
వయోధికుండనేను వాయునందనుండటుంకఁగా
నయుక్తమింద్రభూవివాహమంచుధర్మరాజనన్.

గీ॥ అన ద్రుపదుఁడగ్రజులు మీరలైనఁ బెండ్లి
యాడుఁడన నేవ్వరమును గల్యాణమౌను
మత్తలోదరి మాతృవాక్యంబు కులగు
రూక్తియును నిట్టిదిదెమాకు నుచితమనిన.

క॥ బహుభార్యలొక్కరునికి। న్సహజంబగుఁ బెక్కుమగలు సతికొక్కతకున్
విహితంబగునా యదియే। మహిలో లేదనుచు ద్రుపదమహిపతి పలికెన్.

గీ॥ పలికి లౌకిక వైదికప్రకట ధర్మ। తత్త్వవిదుఁడవు ధర్మనందనుఁడవీవు
నీనుడువుతప్పదెల్లి యీవేనుఁగుంతి। యును విచారింతమని చింతనున్నతఱిని.

సీ॥ ప్రొద్దునుద్దుకొమార్తె పురిటింటిపసిబిడ్డ భరతాన్వయప్రతిపాదకుండు
పాఁగబ్బపుంబల్కుబడి చిక్కుదీర్పరిగారుడాదిపురాణకవనకర్త
రాచబాపన చివ్వరవ్వమున్మనుమండు శుకయోగి వరకథాంశుకపయోధి
తొలుకాఱుమొగులు క్రొందళుకుమేనిమిటారి యతిపిశంగజటాఘటాటునుండు
కేలుకెందమ్మి దండంపుఁగోలవాఁడు
చటులకటిబద్ధపటుకృష్ణచర్మనిర్మ

లాంబర పరాయణుఁడు బాదరాయణుండు
కరుణఁజనుదెంచెఁ బాండవాగ్రజునికడకు.

గీ॥ ఇట్లుచనుదెంచు మునికెదురేగిమ్రొక్కి। ధర్మతనయాదులర్ఘ్యపాద్యంబులిచ్చి
రత్నపీఠిక నిలుపువారలను గుశల। మరసియున్నంత ద్రుపదుఁడిట్లనియెమునికి.

చ॥ పలుకుశిలాక్షరం బుచితభాషణుఁ డీయమనందనుండు నేఁ
డిలసతి నేవురుం బరిణయించెదమంచువచించె ముజ్జగం
బుల నడవళ్ళయుంగుదురు ప్రోడలు మీరిటువంటివర్తనం
బిలఁ గలదేని తెల్పుఁడన నిట్లను ధర్మజుఁడందఱున్విన౯.

క॥ నగవునకుంగలనైనం। దగులునె మామకరసజ్ఞఁదప్పంబలుకుల్
తగవిదిమాకేగురకుం। జిగురాకుంబోఁడిఁ బెండ్లిచేయుటయొప్ప౯.

క॥ మును గౌతమఋషికన్యక। తనము తపోగతివరించెఁ దగనేడ్గురన
ట్లనె దాక్షాయణియను ముని। తనుభవతా భార్యయయ్యె దశపురుషులకు౯.

క॥ గురువులలో జనయిత్రియె। పరమంబగు గురువు జననిభాషణమె నిజం
బరయ వృథసేయరాదన। ననవరుసకు ననియె ద్రుపదనందనుఁడంత౯.

శా॥ సత్యముగాఁగ ధర్మమువిచారముచేయ నశక్యమేరికి౯
నిత్యవిధిజ్ఞుఁడార్యగణనీయుఁడుగానఁ ద్రిలోకవంద్యుఁడీ
సాత్యవతేయుఁడీయన వచస్స్థితివంక శుభంబటన్ననా
ప్రత్యవతంస మాద్రుపదగాణ్మణికిట్లను నప్పుడొప్పగ౯.

ఉ॥ కుంతియు నేలతప్పఁబలుకు౯ యమనందనువాక్యమేల యొ
క్కింతయుఁజుల్కనా జగతి నిద్దటిసుద్దియు దేవతావరం
బింతెకుమారి నేవురకు నిమ్మిది దైవకృతంబటంచునే
కాంతగృహంబుచేరి యితిహాసము చెప్పఁదొడంగె నత్తటి౯.

గీ॥ తొల్లి నాలాయనియనంగ దొరయునింద్ర। సేనసతియస్థిచర్మావశిష్టకష్ట
తనునిఁబతిఁగుష్ఠరోగి మౌద్గల్యువృద్ధుఁ। దగభజించుఁ దదుచ్ఛిష్టమొగిభుజించు.

గీ॥ అంతనొకనాఁడు నిర్మలస్వాంతమౌని। వాలిభుజియింపఁ బాత్రలో వ్రేలుమునిసి
పడినమది నీసడించక కడకుఁదిగిచి। వైచి భుజియించె నప్పతివ్రతలతల్లి.

క॥ భుజియింపఁగఁ గనుఁగొని ముని। నిజభక్తికిమెచ్చి యెద్దినీకిష్టంబో
గజగామినియిచ్చెదఁగోరుమ్ము జగమ్ము నుతింపనన్నముద్దియపలికె౯.

గీ॥ నాథ నీయందు భోగేచ్ఛ నాకుఁగలదు। హేయరూపాకృతులు సూప కిక్షుచాప
రూపసంపద నొంపుదార్కొనఁగఁ గోర్కి। దీర్పుకందర్పకేళి నీనేర్పుకలిమి.

మ॥ పరమానందకరంబధః కృతపరబ్రహ్మం బసారీకృతా
జరసన్మూత్పద మాహృతద్రవిణ చంచల్లాభలోభంబు శం
కరవార్యాన్యము సర్వసమ్మతమనేకప్రాపితానీకమా
సురతం బెవ్వరికెట్టిఁ జేయదిదియే సుమ్మిష్టమాత్మేశ్వరా.
క॥ హృదయేశునిండుకౌఁగిట । వదలని మదవతికివయసు వ్రాలమరతిరా
ట్కృదనంబులేని ముదితయ। ముదియుటయెంతయ్యు సకలమునికులతిలకా.
ఉ॥ గద్దరిచేఁత నేతయిడుగళ్ళ నఖాంకము సాభినామముక్
నిద్దపుమోవికెంపు జిగినిచ్చలపుం గుతికంటు కెంపుసొం
పద్దముచూచి చొక్కు ముకురాననభాగ్యమె భాగ్యమొక్కెడన్
ముద్దియపాన్పుపై నవలిమోమిడి ద్రెళ్ళుటలేటిభాగ్యముల్.
క॥ అనవినిముని నాలాయని। కనువగునని యేనురూపులంది సహస్రాం
శుని తేరుపయింజనిచని। వినువాఁకం గ్రుంకి మేరువిహారణరతుఁడై.
సీ॥ ఒకనాఁడు క్రీడించునకునేడుదితచారుతరసుమేరునమేరు తరుతటముల
నొకప్రౌఢ్దరతిసల్పు సకలద్రుమచ్ఛాయ మలయాద్రి వలయాద్రి మహితగుహల
నొకవేళవిహరించు సీకతాలయోత్తాల హిమశైల సుమసాలసముదయముల
నొకపూఁట సుఖియించు శుకఘోటబలచూతకులపీత కలధౌత కుధరతటుల
చటులతర గంధమందరాచల పటీర।
కుటజ విటపిచ్ఛటాకుంజ కుటిలనిటుల
జటిలనిటలాంబకుఁడు నటత్కుటిల చికుర
ముకురముఖిఁ గామ సంగ్రామమునఁ గరంచె.
గీ॥ గహనబహుమహీధర గుహాకటకకటతటుల। నిటులమర్గల్యమకాని యయ్యింద్రసేనఁ
గూడికొని పెక్కువేలేండ్లు క్రీడసలిపి। యంతసంతుష్టుఁడగుచు బ్రహ్మత్వమెంచె.
క॥ పతియేగినతతి గ్రాఁగిన। సతిరేఁగినవలపుతోడ జాఱినప్రీడన్
బతియోగము రతిభోగము। హితరాగములేనిదాని కిట్లునివగచున్.
శా॥ మౌద్గల్యానత వాలఖిల్యనుత నైర్మల్యా యహల్యాధరాం।
చద్గల్యాకృతి దానదక్షతరవాక్సత్యాంఘ్రిసేవారతా
త్వద్గాఢాపఘనోపగూహన కళాదర్పానుకూలన్ నిశా
పిద్గాంశూత్కరముద్గర ప్రహరణచ్ఛిన్నాంగఁ గావింతురే.
మ॥ పచఁరించాసిన వానిమోముఁగను నప్పాపాత్ముఁడున్వేసవిన్
మిడిమధ్యాహ్నము పైనమైకదలువానిన్వెన్నమంచుండొక

ప్పుడు రామస్మరణంబు చేయనియసభ్యుండున్నచో నున్న య
జ్జడుఁడుఁ గన్పడఁడాత్మదృష్టికనవా సన్మాని సంక్రందనా.

చ॥ చందురుఁడంత నీమొగము చందమువాఁడని లోకులాడుటల్
వినుటనుగాని చూచుటయు లేదెటువంటిదొయాసమౌని సం
క్రందన డెందమాపక మొకంబొకయించుకయెత్తి నేఁడురా
కేందునిఁ జూడఁగావలసె నెట్టిని కన్గొననున్నదాననో.

ఉ॥ వింతకవుంగిలింతల నవీన గళధ్వని యెచ్చరింతలన్
దంతనఖక్షతంబుల నితాంత కచాకచిపైరుచిన్ శచీ
కాంతవనీనిశాంత శశికాంత శిలాతల కంతుకేళిగి
ల్గింతలు గొల్పునాఁటితగులే మనసయ్యెడు నేమిసేయుదున్.

క॥ ఉపవనిమునివై శమివై। తపసివినై యునికిఁగనితొ తాపసలోక
ద్విపమాయని కృపమాయని। జపిరాయని వెదకి మదనశరబాధితయై.

ఉ॥ ఇంచుకతీపువింటికుదయించఁగఁజేసి గుణంబుచేతఁ బా
టించిలకోరి వాసనగడించి పటానికి తెక్కుచాలు గ
ల్గించితినం చయోసుదతికిన్ మదిలేని భయవ్యథలల్ సమ
ర్పించెదు కన్నవారలకు రెండుదలంతురె భావసంభవా.

ఉ॥ కేవలనిష్ఠురప్రథన కేళిమెయింబురుషాగ్రగణ్యులం
గావక నొంపఁగావలయుఁగాక యకారణవైర మబ్జరే
ఖావరకంతులన్ దలిరుఁగత్తులఁ గుత్తుకఁగోసి నెత్తురుల్
దాఁ)వెడువాఁడవీవు నొకరట్టడిబంటువె సూనసాయకా.

క॥ గాంగేయాంగులవిలువీఁ। కంగొని తెరవాటు గొట్టఁగాఁ గఁదనేఁడో
యంగభవభువనమున నొక। భంగిఁ దొరవైతివీవు ప్రద్యుమ్నుఁడవై.

క॥ ఉడుపతి హిమఘృణిచేబలెఁ। దడిపా)ఁతన్ గొంతుగోయు తగవెటఁగితివో
కడుమెత్తని తలిరాకులఁ। బడఁతులమెడగోసెదీవు బాపురె మదనా.

క॥ రూపైతివెటులనోయి ని। శాపతి దోషాకరుఁడవు జైవాతృకతన్
బాపీచరాయువను నా। లాపమ్ములు నిజములయ్యె లలనామణికిన్.

క॥ సోముఁడనంథకవైరి న। హో మృగలాంఛనుఁడననియు నంభోజముఖీ
స్తోమము పైలయకాలో । ద్దామతఁగనిపించెదీవు ధవళమయూఖా.

గీ॥ విషముగ్రక్కంగఁ జూచెదవేసిశిఖి। నీభుజంగుండనంచునో నీరజారి
యైనహరివాడుగాక నీయాటలీడ। నగునె యండజరాజ యానాంగణమున.

క॥ లేటిం దాఁచుకొనవా ము।న్నీటు న్నడయాడ లేదా నిను ద్విజరాజం
చేటికిఁ బలుకఁగ నోకా। ఖేటక పాటవ కిరాటకేసరివి శశీ.

శా॥ సాయంసంధ్యకు రావొకప్పుడది నష్టంబైన మధ్యాహ్న సం
ధ్యాయోగం బొకయింత లేదెకద ప్రాతస్సంధ్యకుఁ సింధువుఁ
డాయంబోయి మునింగి బైటఁ గనుపట్టంగాన మేమీ తమీ
శాయీపా న్నియమంబు లేమ ద్విజరాజత్వంబు నీకర్హమే.

సీ॥ కామికళ్యాణహారుఁడు చక్రద్విజాప। హారుఁడు గురుతల్పగుఁడు సురాహారకర్త
నుధుహితానుగుఁడని నిన్ను మనుజు లాడి।కొనరె పంచమహాపాతకుఁడవు చంద్ర.

శా॥ గాటంపుం జనుదోయి నాభికుహరీక్రమోరువుల్ నీకయో
పాటీరాగమొ పంకజాకరమొ రంభాకేళి కాంతారమో
తాటంకి న్యభిరామ గాత్రములపై ధాటీసమాటీకముల్
పాటింపందగవౌనె మందపవనా పాటల్యటజ్జీవనా.

ఉత్సాహ॥ కోకనద మృగీలలామ కోటికాసమీరమా
తేప మడఁచనిమ్ము కలువతేనిబాసమీరమా
నీకుఁ గొమ్మయంగమింతె నిత్యవాస మీరమా
మాకు విన్నవించనేల మలయగిరి సమీరమా.

గీ॥ అనుచు రతిభోగములఁ దృప్తిగనక తన శ।రీరమంతటు రోసి పరిత్యజించి
కాశిరాజను ఋషికిఁ జక్కగ జనించి। పెక్కువర్షంబు లయ్యెంటఁ బెరుగుచుండి.

ఉ॥ చక్కఁదనంబురోసి వనిచక్కటికిం జని కంజపత్ర యా
రిక్కలరాయనిం దలధరించిన వేల్పుగుఱించి నిష్ఠ పెం
పెక్కఁ దపంబుచేయ యమహేతి మదాప్త సురేశ్వరాశ్వినుల్
చొక్కి నిజాంశజప్రమద సుమ్మనిరంత భవాంతరాప్తికిఁ.

మ॥ ఒకకాలంబు జలానిలాశనముచే నొండొక్కకాలంబు దా
నొక పాదాంబురుహంబు నిల్కడలతో నొక్కొక్కకాలంబు పం
చకృశాన్వంతర భాగసంస్థితులతోఁ జంద్రాననామాళి నూ
త్నిక మత్యుగ్ర తపంబుచేసె జనతాకీర్తుల్ ప్రవర్తిల్లఁగఁ.

సీ॥ రేరాచ గేదంగి రేకుక్రొవ్వెదతోడ పెట్టకన్ జేగురు బొట్టుతోడ
రవణంపు టెమ్ము ము త్తైపుకంటసరితోడ మెడకప్పకస్తూరి బెడఁగుతోడ
తియ్యవిల్ దారి బూది తెలిగందపొడితోడ గాడ్పుఁదిండి పసిండికడెముతోడ
పులితోలు చిఱుతపప్పళి పచ్చడముతోడ మొనపువ్వుడాకాలి మువ్వతోడ

కక్షపాలికతోడ మహోత్కకోరు। రూక్షతాదీక్షతోడఁ బద్మాక్షితోడ
వీక్షణీయుఁడగుచు నిటలాక్షుఁడబల! కక్షయక్షమకపుడు ప్రత్యక్షమయ్యె.

క॥ ఇటులు ప్రసన్నుండై ధూ!ర్జటి వేఁడుము వరమటన్న సతిపతిదానం
బిటు ఘటియింపు మటంచుం। బటువాచాప్రౌఢి నేనుమాటలు పలికెన్.

క॥ పలికిన కలికిం గనుఁగొని! యళికాంబకుఁ డిట్టులనియె నైనుగురం భ
ర్తల వరియించెదు నిజ మో!జలజాక్షీ యింక నొక్కజన్మమునందున్.

వ॥ అనిన విని వినతయై వనిత యవనీతలంబున నొక్క సతికిఁ బెక్కండ్రు మగలగుట యనుచితం బగుఁగావున నే నొల్లనన నల్లన గిరిజావల్లభుం డిట్లనియె నావచనంబున నేవురు పురుషులందు ధర్మ మెడయకుండునట్లుగా వరంబిచ్చితి మెచ్చితినన్న సన్నుతాంగి యంగీకరించి యేవుర వరులందుఁ బ్రత్యేక రత్యనుభవంబును గౌమార విభవంబును బతిశుశ్రూషా మనీషా విశేష కామభోగేచ్ఛా సౌభాగ్య భాగ్యంబును బ్రసాదింప వలయునన దానికోరినవరంబిచ్చి గంగాతరంగిణీ తీరంబుననున్న యాఖండలు నాయండకుం దోడ్కొనిరమ్మనిన నక్కోమలి యట్లుకాకయని కోకిలవాణి పినాకపాణికిం బ్రణమిల్లి యాక్షణంబ చని సహస్రాక్షుం గంగాక్షోణిం బరికించుచుండె నట దండధరుం డనిమిషారణ్యంబున సత్రయాగంబు గావించుటం జేసి మానవులు సుఖజీవులైన మహిమకు సహింపక శతముఖముఖ సంఘంబు చతుర్ముఖ సమ్ముఖంబునకుం జని దేవామర్త్యు లమర్త్యులయిన మాకును వారికి నంతరం బెద్ది యని తహతహపడిన దేవతలకుఁ బితామహుం డిట్లనియె జముని తేజంబును మీ తేజంబునుం జేరి యేవురురాజులై జనించి వారయ్యంతకుచేఁతకు హేతువగుదురనినఁ బురుహూత సహితంబుగా బృందారకబృందంబు మందాకినీతీరంబు చేరునప్పుడు తత్తటినీమధ్యంబున నొక్క యణుమధ్యామణి మనస్తాపంబు నిలుపోప కయ్యవసరంబున.

మ॥ కుధరానర్గళ వృష్టివోలె వలిచన్నుబ్బన్ దృగంబుల్ వడన్
విధుబింబానన యేడ్చెఁ దత్తటవనీ వేల్లత్పయోజోల్లల
న్మధుపాన ప్రథమాన షట్చరణ నానారఝుంక్రియా హంక్రియా
మధురేష్వాస గుణాంకగీతలహరీ మంద్రశ్రుతిప్రౌఢిమన్.

క॥ అన్నీలవేణి యేడ్చినఁ! గన్నీళ్ళన్నియును గనకకమలములయ్యెన్
దన్నులు తామరలుంబలె! నున్నవనం గూడు బెట్టు లున్నయ్యాలకున్.

క॥ అచ్చెలికన్నీళ్ళు సువ!ర్ణోచ్చ సరోజోచ్చయంబు లుదయించుటకున్
విచ్చలవిడి నచ్చెరుపడి! యచ్చేడియఁగని వియచ్చరాధిపుఁ డనియెన్.

# తృతీయాశ్వాసము.

క॥ బాలా యేలా యేడ్చెద। వీలాగున వచ్చు కేమి యెవ్వతె వనది
క్వాలక నా తెఱఁ గెఱుఁగుం। జాలిన నా వెంట నింతఁ జను దెమ్మనియెన్.

వ॥ ఇట్లురమ్మని నమ్మఘవుండు మగువ పిఱుందన చనిచని.

ఉ॥ ముందఱఁగాంచె దిగ్గమణముఖ్యుఁడు వారణవేషభాషణున్
మందరకంధరా కనకమందిర మధ్యవితర్ద్య మంద పౌ
రందర నీలకందర ధురంధర సింధురవైరి పీఠ వా
సేందుకళాకలాపు హృదయేశ్వరితోడను నెత్తమాడఁగన్.

క॥ కాంచివరుణుండు కాఁగఁదలంచిపలికె వజ్రి నాబలంబెఱిఁగియు నీ
కాంచన పీఠికపై వర్తించి చలించవు నమస్కరించ వయారే.

ఉ॥ కన్నులువేయి చేయిగురుకైదువు వజ్రము రాజ్యమంటిమా
యన్నిటికెక్కుడక్కజపు టాజియఁ గొండలతోడి దీగియున్
మున్నె సుపర్వశాఖి గజముం జవుదంతి సురల్ భటాలి నా
కన్నఁగలాఁడె యొక్కఁడు మహాత్ముఁ డహంకృతి నీకు నర్హమే.

మ॥ అనినన్ రుద్రుఁడు రౌద్రవీక్షిత సహస్రాక్షు న్నిరీక్షించి యొ
య్యన నెయ్యంబున నెత్తమాడఁగమదీయ క్రీడవారించె నీ
తనినోయుగ్మలి పట్టి తెమ్మనినఁ దత్కన్యా కరస్పర్శనం
బున ధాత్రింబడి చేష్టదక్కినను శంభుం డింద్రుతో నిట్లనున్.

వ॥ ఆఖండలా యఖండ లాఘవాలాపంబులం గోపంబుపుట్టించితి దిట్టవేని గట్టితనం బేర్పడ నిప్పర్వతశిఖరంబుఁ బెరుకుమన్న మొదటియెలుకు నానతిం దా నతిత్వరిత గతి శిఖరంబంటి మార్తాండ చండకిరణంబులు రెండువిధంబులై యుండుటంజేసి యాత్మసమానుల నలువురంజూచి యేలాకో యిట్లైను నేనువిధంబులయితినం చు నచ్చెరుపడియున్న వియచ్చరవగులంగాచి పంచముఖుండు మనుజయోనిం బుట్టుం డనిపంచె వారును వైవస్వతశ్వసనపాకశాసనాశ్వినులు తమకు సాధారవర్తులుగా ధర్మజ భీమార్జున నకులసహదేవులనఁ బుట్టిరి మఱియుఁ జతుర్ముఖ ప్రార్థితుండైన యచ్యుతు సితాసిత కచద్వయంబులు బలభద్రకృష్ణులై దేవతాహితార్థంబుద్భవించిరి వారికి వాసుదేవుండు సహాయుండయ్యె నయ్యింద్రులకు నేకపత్నిగాఁ దపంబాచ రించి త్రిమూర్తియైన పాంచాలి హోమకుండంబునం బుట్టెనని చెప్పి నమ్మవేని యిప్పుణ్యుల పూర్వకాయంబులు చూడుమని ముని దివ్యదృష్టియిచ్చి చూపిన రమ ణీయమణికుండల గండమండల మౌళితటఘటిత హాటక మకుటహారిదశ్వవైశ్వా నర వర్ణవర్ణనీయదేహుల నాజానుబాహుల ధీరుల నేవురను వారికిఁదగిన సౌంద

ర్య ధుర్యంబును నపూర్వతపంబు చేసిన యక్కన్య పూర్వదేహంబునుం జూచి యద్భుతం బందియున్న యన్నరపతింగూర్చి యుట్టివిశేషంబులు తొల్లియుం గలవు దైవాభిప్సితం బిది పాండవులకేవురకుం బాణిగ్రహణంబు చేయింపుమని యొడం బఱిచి యుధిష్ఠిరసమీపంబునకు వచ్చి కృష్ణద్వైపాయనుం డిట్లనియె.

క॥ లోకోత్తరదినమిది రజ।నీకాంతుఁడు నేఁడు రోహిణీయుక్తుండై
మీ కనుకూలత నున్నాఁ। డాకన్యక వరుసఁ బెండ్లియాడుఁడు మీరల్.

క॥ అని యానతిచ్చి చనియెఁ। మునిమౌళి పృథావధూతనూజ మనోజుల్
పనిఁబూనిరి పాంచాలీ। వనజాయతలోచనా వివాహోత్సుకులై.

శా॥ కావేరీ లహరీపరీత హిమరుక్కాసారవా సాదరా
సావేరీ ముఖరాగ భాగ్యమహిణ భూసంగీత భంగీగతా
కావేరీప్సిత పల్లవీసదృశ రంగద్వల్లవీ వల్లభా
భావేరీ భవదోంక్రియామయ సమభ్యంచ ద్వినూనాంతరా.

క॥ సప్తీకృత పత్రీశ్వర। సుప్తీకృత జలధిదర్శ శోభకశయ్యా
సుప్తా సప్తప్రాకా। ఠాప్తాలయ హస్తకిసల యస్థితమలయా.

భుజంగప్రయాతము॥ తృణావర్తహారీ నదీభూవిహారీ
ఘృణావర్తనాప్తా శమీశానగోప్తా
ఫణానర్తనాల్పా శ్యభామాగ్రతల్పా
ప్రణావర్తదాసాధిపధ్వాంతవాసా.

గద్య॥ ఇది శ్రీమద్రామభద్ర భజనముద్ర కవిపట్టభద్ర కాద్రవేయాధిప వరసమా గత సరససారస్వతలహరీపరిపాక కాకమాని ప్రబోధబుధకవి సార్వభౌమ పౌత్ర రామలింగ భట్టపుత్ర కౌడిన్యగోత్ర భాగధేయమూర్తి ప్రణీతంబైన పాంచాలీపరిణయంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

---

# పాంచాలీపరిణయము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీరంగనిలయపాణి మ।ణీరంగద్వలయ విశిఖనికృతోదన్వ
త్తారంగ విలయగుణ నట।నారంగనగాలయ సహ్యనగజానిలయా.

వ॥ అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుండిట్లనియె.

క॥ ఘనఫణిమణితోరణ ఘృణి । కనకాంబర కాయమానగణచిత్రములన్
మనుపంటి పురముగాదిది । యనిపించినపార్షదాలయము గనిపించెన్.

చ॥ చిగురుల తోరణంబులును జీలుగుఁబువ్వ లనంటికంబముల్
పగడపుఁగుచ్చు లద్దములు బంగరుత్రాఁ తదుకూలజాలముల్
మొగలివిరుల్ సరుల్ సవరముల్ ధ్వజముల్ గజనిమ్మపండ్లు తీ
రుగ నగరీగృహంబు లడరున్ రథముల్ కయిసేయుకైవడిన్.

ఉ॥ మేకులతీరులాకురుఁజు మీఁదులఁ జెక్కిన చెక్కియంబులా
గారుడరత్నతోరణ ధగద్ధగలా తెలిగచ్చుమచ్చు లా
బేరిమిటారి కత్తియలు పెట్టిన ముత్తెపు ముగ్గుసిగ్గు లా
యారతినాటిత్రాఁత పనులంగడి ముంగిళులాపురంబునన్.

క॥ పట్టుంజల్లియు సవరము । కట్టాణిమెఱుంగు నత్తికపుఁదోరణమె
ప్పట్టునఁ జెలిపుట్టము మే।ల్కట్టాకటిం బట్టణమునఁ గనమెట్టెమెడన్.

క॥ చెంగావి కట్టుగట్టని । ముంగిలి ముత్తెపు ముగ్గుముంపనికడపల్
బంగరు చిత్తరువెత్తని । యంగణముం గానమెందు నప్పురమందున్.

సీ॥ గ్రామీణ ఘటమాన కటకాయమానంబు దర్వీముఖాకృతి తత్ర వృతము
భిత్తికాలంక్రియా భృత్యభృన్నిశ్రేణి భస్త్రికాజన గళత్పాంసుభరము
నటనూరజిక వధూనటినందదధికారి యాత్తనిస్వనమాంసలాజ నిహతి
ఘోషవద్గోధూమ మాషఘరట్టంబు బహులశర్కరతైలపక్వసురభి
ఘస్రఘటికాఘటీతటి ఘటితరజని। లేఖన పురోహితాహ్వాన లీఢగాఢ
ధావనాయాత యాతవదత్పదాతి। పెల్లుగొదచెల్లునప్పు డప్పెండ్లియిల్లు.

క॥ అంతటనృపుఁ డంతఃపుర। కాంతలఁ గుంకుమహిమాంబు కస్తూరికలన్
వింతగ నలుంగులిడ్డుఁడని। కుంతీనందనులఁ బెండ్లికొడుకులఁ జేసెన్.

ఉ॥ జోడుగఁగూడి ప్రోడగమి చొక్కపడన్ ధవళంబు పైరవిం

బాడిని బాడిరిద్దఱుజపా కుసుమాధర లాధరాధినా
థోడుకళత్రనేత్ర యుగళోత్పలముల్వికసిల్ల వల్లికే
గాడవరాళిపైరి కలకంఠగళోద్య దసర్గళధ్వనిన్.

మ॥ అలరుంబోఁడులుగూడి ధర్మజునకేవక్షేక్షణాబాణవే
తలయంటుం దగుదీవు భీమునితలం దైలంబిడన్నీవు పా
టలగంధీయిటురమ్మ క్రీడిశిరసంటన్ మీరు మాద్రీకుమా
రుల కభ్యంగముసేయుఁడంచు కయినేర్పుల్చూపి రేర్పాటుగన్.

మ॥ అలకల్ విప్పి చిటుక్కునం గొసరుడాయంగుక్కినంతం దలన్
గలయన్నూనియ వెట్టుటల్ వలయ నిక్వాణంబు రానంటుటల్
సొలయన్ దువ్వుటలుండఁగా నడుమనాసుభ్రూకర స్పర్శమే
కళయంబెండలయంటుటింతయు నెఱుంగంజాల రప్పాండవుల్.

చ॥ అటకలివెట్టె నొక్క కుటిలాలక నీలకచావతంసకం
బటకలితాంబువుల్ మణిమయంబగుతంబుగ వంచెనొర్తు దు
ప్పటమొక హాటకాంగి నునువాటపుఁ జెన్నెఱులంటఁజుట్టె నం
తటఁ దడియొత్తె నొర్తు వనితామణియున్ శిఖపైచెవైఖరిన్.

క॥ వడివేఱువేఱ శిరసులు। గడిగి బెడంగయిరికుంతికాంచిన కొడుకుల్
వెడవింటి జోమమెరవడిఁ। గడిగిన నారాచపంచకంబోయనఁగన్.

సీ॥ అరచుట్టు పైఁగట్టు నపరంజి రెట్టొంపు నునుకట్టుఁగని వెన్నుఁడనుకరింప
తీరైన నెలవంకతిరుమణి హిమఘృణిచూచి యమ్మక్కని చొక్కిపడఁగ
సిగమీఁది విరవాది చేర్చుక్కపసగాంచి మరివసఁతుఁడు కొంతమఱలుకొనఁగ
సొమ్ముల యమరికల్ సోరిది నిరీక్షించి కలవానిసుతుఁడింత కన్నుద్రేయ
పాంచజన్య భుజపాత్రిణ పంచకంబు। త్యాగలేఖద్రుమపంచకంబసమబాణ
బాణపంచక మున్నిద్ర భద్రవేది। పంచకరుదెంచెఁ బాండవపంచకంబు.

వ॥ ఆసమయంబున.

చ॥ నిటలతటిన్ శుభాక్షతలు నిల్పుచుదీవనలిచ్చి యిమ్మహా
కుటిలకచాశిరోమణికిఁ గొమ్మలు సంపెఁగ నూనెయంటరే
యటకలివెట్టరే జలకమార్చి వడిం దడియొత్తి చిక్కుదీ
ర్చుటలుఁ బసిండికుంచె నెరిసోగలుగన్పడ దిద్దరే నెరుల్.

ఉ॥ పాటలుపాడుచున్ గొనబు పాపటఁ దీర్చి కొప్పమర్చరే
పాటలగంధికిన్ నిటలపట్టికఁ గస్తురిబొట్టుఁబెట్టరే

కాటుకదీర్పరే యెరకగన్పడఁ జెంగురుకావిగట్టరే
గాటపు గబ్బిగుబ్బ చనుకట్టులఁ జేర్పరె హారవల్లరుల్.

సీ॥ బాగాయెఁగా కెంపు పాపటబొట్టుతోఁ గొనబుముత్తెపుఁగుచ్చు వనితనాసల
చెలువాయెఁగా జంట చెంగావిరవికతోఁ సరులిచ్చు మకరికాస్తనభరంబు
రంగాయెఁగా రత్నగళనతోఁ గావి చొక్కపుపావడముకూల కటితటంబు
నలువాయెఁగా రణన్మణినూపురములతో నపరంజి మట్టెలాతాంఘ్రియుగళి
యమ్మ యిమ్ముద్దుగుమ్మకేసొమ్మకింత। నెమ్మయి నలంకరింపనీనిలువు నూపు
బంటినటువలెనున్నదీ పాండుసూను। పంచకము భాగ్యమారార పడఁతులార.

మ॥ అను చో వృద్ధపురోహితుండొకఁడు డాయంబోయి మీపాటలం
దినెగుల్ మున్పుచుఁ గొప్పఁబెట్టుచుఁ దుదిన్నిందించునీయంచు ము
ట్టనిసింగారము లేఁది లగ్నమిదిగో డాసెన్ మహాగ్రుండు రా
జునయో నిన్నెఱుంగరా కదలుఁడంచుం బండ్లుగీటెన్ వడిన్.

చ॥ బిసరుహలోచనామణిని బెండిలితిన్నియఁ జేర్పనప్పటిన్
ముసుఁగొనరించుఁడీ నాసలిముంజెఱఁగించుకవంచిపట్టుఁడీ
బిసబిసఁబోక యొయ్యనడపింపుఁడుముంగు మెఱుంగుమెట్టికల్
మసలికనెక్కఁ డెచ్చరిక మచ్చికనిల్పుఁడు భద్రపీఠికన్.

గీ॥ పెలఁదికదలారతికి నెంతవేగిరంబు। క్రొత్తముత్తెంబుల నివాళి యెత్తరాదె
గౌరికల్యాణమునకేమి కంతుఁ గన్న। తల్లి ధవళంబు పాడరాదాలతాంగి.

గీ॥ పెలఁదిపీడెంబు పసవెట్టవేళలేదె। ధవళమనుమన్న వదనాబ్జధవళమునను
నీవునీవంచు మొగమొగంబేలచూడ। సిగ్గుపడనేల మగవారి చెంతననుచు.

శా॥ నీకేవచ్చు సువాలయుంధవళ మింతీయల్లానేరేళ్ళ గా
రీకల్యాణములంచు నింటికడ నేనీతిన్ విజృంభింతువే
వాకీవిచ్చటనంచు నిద్దఱుసతుల్ వాక్యోపవాక్యంబులన్
గాకై ముందలపట్లుకుం దొడఁగిరా కల్యాణవేదిస్థలిన్.

ఉ॥ అఘ్ఘుషలోచనల్ పలుకునప్పుడు విప్రులు హోమవేళ మీ
రొర్ఘ్ఘుబురండు తెండు సమిధోత్కరమీయవధాని బ్రహ్మయీ
యర్ఘ్యములోన యాపనసయన్న వశిష్ఠులుమీరు శ్రౌతమం
దర్ఘ్యరెయంచుఁ బంచుకొనిరందఱు వేల్చుచు ద్రవ్యదక్షిణల్.

క॥ మిహిరాసిత గురుబుధకవి। మహికాంశుక రాహుకేతు మహిసుతులనుచున్
గ్రహియించెన్ ధనము నవ। గ్రహనెపమున విప్రరాజిరాజులచేతన్.

ఉ॥ మంగళసూత్రమంగ గరిమంగళలంగను సర్వమంగళా
పాంగ నటద్ఘృణాఖనికి సంగనకున్ గళసీమఁగట్టెరా
ట్పుంగవచక్రవర్తి విధుపూర్ణముఖీకుచకుంభ పాతశా
తాంగ భవాసిభాని నఖరాంకురముల్ గిలిగింతగొల్పఁగన్.

మ॥ కులుకుందోరపు గబ్బిగుబ్బ చనుముక్కుల్ నిక్కి చొక్కంపుఁ బ్రే
చుళి నొక్కింతవకావకల్ గొలుప మించుల్ గ్రమ్మ దోర్మూల ని
ర్మలశోభల్ భుజభూషలం జికిలిదోమం బొల్చు మత్పాణింజలిం
దలఁబాలోయ్యెనెఁ దలోదరీమణి పృథాతామ్రాంధరాసూతికిన్.

గీ॥ ధన్యకన్యక ద్రుపదుండు ధారవోయ। ధర్మతనయునివెనుక నాథాభ్యుఁడంత
నింతిఁ బాణిగ్రహణము చేయించెనటుల। కడమ నల్గురిచే యథాక్రమముగాఁగ.

మ॥ ద్విపముల్ నూఱురథంబులట్లు హయముల్ వెయ్యేసి దాసీమణుల్
చపలాక్షుల్ పదివేవురుం గనకచంచన్మంచ కాంచన్మణీ
తపనీయాభరణంబు లెన్నియయినన్ ద్రవ్యం బపారంబుగాఁ
గృప నొక్కొక్కరి కగ్నిసాక్షిగ నొసంగెన్ మామ యల్లుండ్రకున్.

మ॥ ఘన పాకాన్నము గన్నవారలకిడన్ గన్నారె రూకన్న నా
కును బోకన్న నొకన్న మున్నిటులు గోకామ్మన్నచో టున్నదా
మన ప్రాకెన్న చెలంగెఁ గీర్తిలతికల్ పాకారిలోకంబు వెం
టనె ప్రాఁకెన్నయ మెప్పనంచు నరులాడంజొచ్చి రిచ్చాగతిన్.

గీ॥ నాగవల్లి మించె నానామణిషి పు। న్నాగవల్లి తేచ్చ బాగుదీర్చి
త్యాగ మెల్లి యనుచుఁ దక్కువారలొసంగు। నాగవల్లి మాత్ర మేగణింప.

గీ॥ ఏడుఁదేండ్లి నాఁడహీన కాహళ శంఖ। పటహవాద్యపద్యబాణవిద్య
భోరుకలఁగె భూనభోభాగమారేయి। పట్టపగలు చేసెఁ బంజులెల్ల.

ఉ॥ విందులకెల్ల నేఁడిచట విందనినన్ సచివుల్ పురోహితుల్
గొందఱు బజ్జిపచ్చడులు గూరలు చారులు పిండివంట లె
ల్లం దగఁదెచ్చి సైంధవ శిలాకులతుందిల పాకమందిరా
ళింద బహిర్మహీ రచితలేఖ మణీఖచితాగ్రవేదికన్.

క॥ వంటయొకించుక చేయుం। డంటుల్వ్యన్నారొ లేదొ యచటిసువారం
బింటికలకంత లొకగడె। యంటనెకావించి రీశ్వరాయుతమునకున్.

మ॥ పిలువంబోయిన యంగజాలతరువుల్ బీరమ్మలున్ బొమ్మ లె
క్కుల ఫూఁతల్ గనిపింత యెత్తుబురుసా కుళ్ళాయ లందంపుఁ జే

తులగఁదం బిరచట్టికుంకుములు కస్తూల్ హత్తి గేహాల్పభో
జులునై యెమ్మెలభోజనంబులకు రాజుల్ వచ్చి రచ్చోటికిన్.
క॥ వింసున కరుదెంచిరి తల। కుంచగ్న దోవతులు పట్టుకోకలు పెంటం
గొందబుషిల్లలు జతగా। నాంపోళికలంబురోహితామాత్యవరుల్.
మ॥ బుమతల్ పెద్దలు వీజనంబులును జెంబుల్ గొప్ప దొప్పాకులున్
నిడియందంబులచొప్పయీనెలాకయింతేప్రొద్దు పోకుండ నాఁ
గడు వీరల్వలెఁ జెట్టరాదనుటలుం గన్పట్టఁగా నూరగా
మిడిచాపల్చనుదెంచురా ద్రుపదభూమీభర్త యుత్సేరఁగన్.
క॥ తెప్పలుగా దొప్పలుమరి। దొప్పలకుం దగినయాకు తుదినాకులకుం
జెప్పనగు పసిఁడిచెంబులు। నప్పార్థి వుఁడేర్పరించె నయ్యోడనెడకున్.
క॥ కడలేనిపెడలుపెంతే। నిడివియు నగ్రముల తగులు నిగనిగలిగుసుం
గడిమి గల యనఁటియాకుల। యెడఁ జూచినఁగడుపునిండదే భోక్తలకున్.
ఉ॥ ఇక్కడఁ గూడ్చుండుటలకీరలెపెద్దలు లేచిరంపు మీ
రొక్కరు వంటశాలకఁపు యోగ్యముమీకది తేమకేమి యూ
ముక్కలి పీటమీదియది మూర్ఖుల చోటిటు మేలటంచు స
ద్వాక్కుల నక్కులాధిపుల వైదికులందగుచోట నుంచినన్.
ఉ॥ వడ్డనఁజూపిరంత చెలువల్ తెలియోగిరమొల్పుపప్పు మెం
డొడ్డిన కూరగాయ ఘృతముక్కెర చక్కెరతేనెలడ్డువా
లిడ్డెన నానవాలు చలియించని తైరులు మోరుమేరుపై
గిడ్డిదలంబిరోయనఁగ గేస్తులకబ్బె సమస్తభాగ్యముల్.
క॥ చేతమెతుకంట కుండన్। శీతాభోగముల వారిచిన యోగిరమా
రా తుమ్మిపూల తెలుపా। హాతావియయారె వేఁడియని వేఁడిరొగిన్.
క॥ గేస్తులకుఁ బసిఁడిగిన్నెల। కస్తూరియనంగ పెంత కర్పూరంబే
శస్తమన వాసికెక్కిన। నిస్తులసద్యోఘృతంబు నెలఁతుకవంచెన్.
క॥ ధూర్తులు దిబ్బొరీచమ। వార్తకమటంచు మరీచవర్ణన గనుచున్
గీర్తించిరి తొడిమఋథి। గ్వార్తాకమ వృంతకమని వంకాయఁదగన్.
గీ॥ ఉప్పుపులుసుఁబట్టి యొక్కింతమిరియంబు। ముట్టితిరుగఁబోఁత చుట్టిపట్టి
నేత వేఁచినట్టి నిడుపుఁ గాకరకాయ। వరుసనిడియెనొక్క వంటలక్క.
క॥ ఉడికినపిమ్మట మిరియము। పొడి బెల్లముచల్లి యుద్దుపొడిరాలిచి నే
తిడినెట్టఁగవేఁచిన కేఁ। పుడుఁగంద మిళిందవేణి పొంటుగనిడియెన్.

క॥ ఇడఁదగిన పులుసుమిరియము। గుడుముంగల వేఁడివేఁడి గుమ్మడితునకల్
బెడిదంపురసము గూడఁగఁ బడఁతుక వడ్డించె నొకతె బడలికదీఱన్.

క॥ ముట్టినదె ముట్టిచుఁజేయును। బట్టినదే పట్టి ముళ్లువడక పడంతుల్
గట్టి మిటాయిలు బంగరు। చట్టులవడ్డించి రెట్టి జగజెట్టులనన్.

ఉ॥ ఎందఱు బోనకత్తెలు మహీందలచూపరు మందయాన లా
యందెల మ్రోఁతలానగవులా పిఱుఁదంటిన కీలుగంటు లా
కుందనపుం దనూలతల క్రొందళుకుం దొలుకారుమించు లా
యిందుకళాకలాపుఁ డొకయింతగనన్వడదాఁకి చొక్కఁడే.

శా॥ వక్కాణింపఁగరాని వీజననభస్వత్కాచయంత్రాంబుభృ
ద్దిక్కేలద్ఘుట కోటి నింహమణివేదీ వాలు కావాలతన్
మక్కాచెంబులఁ జల్లఁజేయ వడిగండ్లంబోలు సౌరభ్య స
మ్యక్కద్వీపవతీజలంబు జనమాహాయించుఁ ద్రావెందమిన్.

గీ॥ ఓర్పుగలవారలా మీఁద దర్పితారి। యోర్పుగలవారు రాజకందర్పులార
యోర్పు గావింపరాదె యీ యూర్పులకును। నేర్పుతో నంచుఁబంతులుతూర్పువట్టి.

సీ॥ అమృతోష్ణపక్వతావ్యక్తంబు భుక్తంబు గ్రామాంతరాపణాగతము ఘృతము
పవమానసఖముఖా పాకంబు శాకంబు లసదామ్లలవణ నీరసము రసము
ప్రోద్ధూత శర్కరారూపంబు పూపంబు విగళితమాధుర్య నగరి సిగరి
యంబు గోఘస్య ఖిన్నంబు క్షీరాన్నంబు హాతశుచి రుచిపాలు నానవాలు
చారులే కావు బజ్జిపచ్చళ్ళతీరు। పేరుకోకున్న యీ తైరునీరుమోరు
లెట్టుల భుజియించెదరటంచుఁ గృపదలిర్ప। ద్రుపద నృపదర్పకుం డప్పుడుపచరించె.

క॥ బుధులయిదా ద్రుపదాధిప। మధుర శరచ్చంద్రికా సమధిగతదీధి
త్యధరీకృత చణమాహింప। దధికలశోదధికిఁ గలశతనుభవులగుటల్.

క॥ వడపిండెయు మామెనమా। రెడుగాయయు నల్లమున్ మిరియపుగ్గాయల్
కడసుండఁగఁ దొక్కుఁడు మా।మిడి కాయయునూరుఁబిండ్లు మెచ్చిరలంతుల్.

క॥ అజ్జనములు లవణైలాం। చజ్జృంభము మిళితజంభ సంధిన్నగహ్వా
త్వజ్జాంభము గుంభిత రం।గజ్జంభము నీరుమజ్జిగం గొనియాడెన్.

క॥ ఉప్పూఁరఁగాయ వడియం। బప్పడముం బాఱుఁ గూరలన్నము ఘృతమున్
బప్పుం బాయసముం బా। లప్పాలున్ దధియుఁ దక్రమానని రథెపుల్.

శా॥ ఓరన్బెట్టిన యప్పళాలు కడలందొప్పారు సేద్దొప్పలున్
దోరన్ వట్టిన చంద్రఖండములు దొంతుల్గన్న వెన్నప్పముల్

ధారల్గట్టిన ఫట్టతేనె వఱదల్ దార్కొన్న క్షీరాన్నముల్
మేరల్పట్టిన గట్టితైరులివిసుమ్మీ భోక్తృసంత్యక్తముల్.

సీ॥ ఒకవ్రేలఁజవిచూపి యోరఁద్రోచిన బజ్జి యాఘ్రాణమునఁ జేర్చు నామ్రఫలము
లాసనిడ్డిన నేతసద్దిఱిప్పిన దొప్పపైచప్పరింతల పనసతొనలు
చక్కెరఁ బొరలించి చాలించు రసదాళ్ళు కడద్రుంచియుంచిన కమ్మవడయు
మీఁదిమీఁగడమాత్రమే గ్రహించిన దధి యంటిపైపిన కలవంటకములు
కొఱికివిడిచిన యూర్గాయకొంతనాల్క। నూపిపడవైచు జున్నులుమూతిమట్టి
మీటుపర్ణపుటీతక్రమే ఘటిల్లె। భోజనాంతానమత్కుక్షిభాజనములు.

క॥ చేతులకిడు నూతనకల। శీతలకేతక సుగంధిశీతలజలముల్
భూతలమున దొరుకుట యొ। ట్లీతల సింహాసనస్థహిత సేవనకున్.

క॥ పొంకముగ నతఁడు నృపమీ। నాంకులకంకురితఘుమఘుమామోదహిమై
ణాంక మృగీమదపేషిత। కుంకుమ పంకంబు గాజుఁగోరల నొసఁగెన్.

క॥ ఆగుణమణి యొక్కనికిడు। బాగాలేచాలు బహుళపరిణయములకున్
బాగైన వలువలొకనివి। భోగింపఁగ సీమకేఁడ్లుపూఁడ్లకుఁజాలున్.

శా॥ గవ్యాపార కృపాకృపాణహత రక్షఃకుక్షిదోరంగ రం
గవ్యాపార పరాపరాశర నిరీక్షాహృష్టభాచక్ర చ
క్రవ్యాఘాతమురామురళ్యమిత రాగస్థాపనాదక్ష ద
క్షవ్యాళక్షతి తార్క్ష్యదేవనుత రక్షాదీక్ష దీక్షానిధీ.

క॥ కస్తూరిరాయకౌస్తుభ। వస్తూరీకృత శరీరవైభవభవ భ
వ్యస్తవనభవన నవనీ। తస్తేయవిధేయ సంతతస్మేరముఖా.

ఉత్సాహము॥ మిత్రజాంబవద్విదర్భమేదినీశ్వరాది స
త్పుత్రికాభుజాగృహీత భోగ్యనాగవల్లికా
చిత్రవర్ణతాళవృంత చేలఖండ చామర
ద్విత్ర పంచపాఖ్యముఖ్య వీక్షణీయలక్షణా.

గద్య॥ ఇది శ్రీమద్రామభద్ర భజనముద్ర కవిపట్టభద్ర కాద్రవేయాధిప వరసము-
గత సరససారస్వతలహరీపరిపాక కాకమాని ప్రబోధబుధకవి సార్వభౌమ
పౌత్ర రామలింగ భట్టపుత్ర కౌండిన్యగోత్ర భాగధేయమూర్తి నామధేయ
ప్రణీతంబైన పాంచాలీపరిణయంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

# పాంచాలీపరిణయము.

## పంచమాశ్వాసము.

క॥ శ్రీరమణీమణిధారీ! ధారీధవ సుత రథాంగతటభిన్నారీ
నారీశృంఖలపంగు శ|రీరహిత గాంగలహరి శ్రీరంగహరీ.

వ॥ అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుండిట్లనియె.

గీ॥ ఏగుఁబెండ్లినాఁడె హితబంధుసమ్మతిఁ| బెండ్లికూఁతు మొదటిపెండ్లికొడుకుఁ
గూర్తుఁమంచుద్రుపద కుంభినీభర్త దం|పతుల కేర్పరించెఁ బడకయిల్లు.

మ॥ తనయత్యంత నిశాంత శేఖరముచెంతం దండ్రిబాల్యంబునన్
దనకర్పించిన దర్పకప్రముఖ చిత్ర స్తంభ విభ్రాజి భో
జనశాలాంగణ పాకమజ్జన మహాశయ్యా గుహావ్యూహ స్వా
తన కృత్యోతన రాట్సురాతన మణీధామాంతరాళంబునన్.

మ॥ నెలరాటూకుమిటూరి చిత్తరువు కన్నెల్ సన్నసున్నంపుఁ ది
న్నెలు జేజే దొరరాతిగోడ కడవన్నెల్పోవఁ జెంగావి వ
న్నెలు పూఁగైదువు వన్నెరాయ పనిచిన్నెల్ గచ్చుమేల్మచ్చులన్
జెళకం జాలిన కేళి ధామమటఁజూపెన్ మామ జామాతకున్.

క॥ మంచి ముహూర్తంబిది నన| పాంచాలిందోడి తెండు పతి కడకని స
మ్మంచెన్ ద్రుపదక్షితిపతి| యంచుఁ బురోహితులు దేవికయ్యెడఁ దెలుపన్.

క॥ కొప్పువిరిదండదవిలిన| దుప్పటి వలెవాటుతోడఁ దొయ్యలికైదం
డొప్పఁ దమతోడ నూఁచుపు| జొప్పలతో నప్పడింతి సొంపుగ వెడలెన్.

గీ॥ సుదతి యొడ్డాణమేదట్టి చుట్టుగాఁగ| రాలయుంగరముల చాలెత్రిడుగాఁగ
మంచియరగందపొడి మేనిమట్టిగాఁగ| జత్తజభుజాభుజికి జగజెట్టివోలె.

గీ॥ కట్టుకంబమునకుఁ గరివోలెదాదుల| బలిమి నరుగుదెంచి పడకయింటి
కడపదన్ని యవల నడుగింత యిడదాయె| నాతిమొనకు డాయ భీతిగాదె.

ఉ॥ పట్టుతలాడయున్ హాళఁదిపచ్చనునుం బఱపెంద్ర గోపపుం
బట్టుకురాడమం దొగరుబట్టియుఁ దెల్లనిచల్వయుం బనుల్
వెట్టినకట్టుతో బటువుబిళ్లలు దంతపుఁగోళ్ళ గ్రచ్చు క్రొం
బట్టెలుగన్న యానృపతి మంచముపై సతులుంచిరచ్చెలిన్.

క॥ అలకల్గొని భీతిత్రపాల లఁతికవునుబట్టి సకియలటునిటు దివియన్
నిలుచుండఁ గూరుచుండం| గలకొంచికఁ బట్టెనొక్కగడియ కడంకన్.

క. ఓరమణీమణి చక్కఁగానుండుమన్న। నమ్రశిరసొంది చూడ్కిలో నానయంది
సరసఁగూర్చుండి బాగాలొసంగి రెండు। మడుపు లీరాదె భర్తతుందదుకుదీఱు.

ఉ. వీడియమిచ్చినీవు నొకవీడెము గొమ్మని కాంతుఁడింత ప
య్యాడ గరుక్కునం గొటికి యాకథరంబున నందియిచ్చుచో
వీడకపంట నొక్కి పెదవిన్నునుఁ గెంపొదవింప కయ్యయో
వ్రీడకుఁ బాలువడ్డ వెడవిల్తుఁడు శాంతుఁడటే తలోదరీ.

ఉ. నీచలమే ఫలించెఁగద నీవఁట నీరమణుండఁటమ్మ కొ
మ్మాచిరసౌఖ్యముల్ గనుఁడు మక్కువ నొక్కటి మీరు వేఱుమే
మే చెలిపోయివచ్చెదము మీకవుఁగిళ్ళ సుఖించువేళలన్
మాచెలువల్ గదా యనుచు మమ్ముఁదలంపుఁడు దంపతుల్ తుదిన్.

క. గారామునఁ బెరిగిన శృం।గారాంబుధిగాని గడుసుగా దొకనాఁడు
న్నేరుపులగానిఁబెట్టెను। సూరాసుత చూడ సూన సుకుమారసుమీ.

క. కొమ్మలు లేరా బంగరు। బొమ్మసుమీ రాచయిండ్లఁబుట్టుదురా యీ
యమ్మబలెఁ గన్యకార। త్నమ్ములు మీపూర్వజన్మతపమెట్టిదియో.

క. మీభాగ్యంబున దొరికెన్। సౌభాగ్యనిధానమైన జవ్వని పాంచా
లీభామ భవజ్జనక। త్న్మాభరణఫలాప్తి కిదియె కారణముసుమీ.

ఉ. ఓయమృతాంశువంశనిధి యున్నసతుల్ వలెఁగా దొకింతయుం
జేయుటెఱుంగదూడిగము చెప్పినపనుల్ గొనుఁడింక నింతమం
కీయమనేర్పు నేరముల కెగ్గుగఁజూడకుఁడంచుఁ జేతిలోఁ
జేయిడి యప్పగించి యలచెల్వలు వెల్వడిరిల్లు బల్విడిన్.

ఉ. పట్టఁగనీదు చన్నుఁగవ పాణితలంబిడ నీదు కొప్పుపై
ముట్టఁగనీదు మేను పలుమోవఁగ నీదధరోష్ఠ మాకులం
జుట్టదు చూడ చాడదొకసుద్దియు గుండియగూడు పట్టి నాఁ
డెట్టుభరించినాఁడో హృదయేశ్వరుఁ డవ్వలరాహాశాహాళిన్.

ఉ. పైఁటకులాగులాడి కటిపై ఘటియించిన చేవిదల్పులన్
బాటిలినీవికై పెనఁగి పైఁబడి చేతులతట్టి వేఁతల
న్మీటుగ నాటఁబట్టు బలిమింగనమిం దగదొట్టి జెట్టి పో
రాటములాయె నాయనకొయారి యెడాటములన్ హుటాహుటిన్.

క. అక్కలభాషిణిఁగొమ్మని। వక్కలుచేనిచ్చినపుడ వలఱేఁడు వడిన్
వ్రక్కలుగఁ గొట్టెబిట్టుగ। నక్కరుసంపనుని డెందమరవిందగదన్.

క. కన్నెకొనగోరఁ జీరిచి । నున్నంబిడి మడిచియిచ్చుచుట్టుల వీడెం
బిన్నదినంబులకన్నన్ । గొన్నిచవుల్ హెచ్చుచూపెఁ గువలయపతికిన్.

క. చక్కెరయొకపరి నొకతఱి । నుక్కెర యొకసారి తేనె యొకమాటమృతం
బక్కీరవాణి వాతెఱ । నొక్కెనతఱిఁ జిక్కెఁబతికి నూఱేసి రుచుల్.

ఉ. సందాకయింతయాని బిగిసందిటఁ గ్రుచ్చి ప్రవీణపాణిచే
నంది ముఖాముఖిన్ సఖిసుధాధరముం గబళించి పీల్చి తే
నెం దగఁ గ్రోలి కెంపునిచి నిద్దపుగంటి రచించి శ్రీ
ల్చెందుదినజ్జునజ్జుగను జేసి నిజేశుఁడవార్యవాంఛికన్.

ఉ. వాచవి చూచిచూచి సతివాతెఱ చన్గవపట్టివట్టియున్
వాచతురత్వమింక వెడమాటగుఁ గాక యనంగఁ బోక కా
లోచితకార్యమెంచక నవోఢ గదా యనఁ గూడ కెంతయున్
వాచిన వానిరీతి రతి నాఁడు హళాహళిచే నెవానికిన్.

చ. గళరవభేదముల్ గఱపి కౌఁగిటిపట్లు బిగింపెనంగుటల్
దెలిపి నుసీత్కృతి ప్రకృతిదిద్ది కళింపెళులింత నేర్పి ని
స్తులనఖరద్విజక్షతము సొంపెఱిఁగించి యపారపున్ రతుల్
పలుమరు శిక్షచెప్పి పతి ప్రౌఢను జేసె నవోఢనంగనన్,

చ. అలయిక యింతలేక పతినంటి పెనంగెడుచోట జెట్టియై
బెళుకుదలిర్పఁగా నధరబింబము చించెడు చోటఁ జిల్కయై
గళరవభేదముల్ దెలుపు గట్టితనంబునఁ బావురంబునై
కళలఁ గలంపనేర్పఁ గలకంఠి రతిప్రకృతి ప్రవీణయై.

ఉ. కమ్మనియూర్పు గాడ్పు చలక్రమకుచమ్ముల పూఁతయూతఁగా
నెమ్మొయి ఘర్మముల్ సొలుప నిద్దపుఁజెక్కుల తేట నవ్వ లం
పమ్మునజాఱిజాఱు వగసందెడు క్రొవ్వెద క్రొవ్విరుల్ సహా
యమ్ముగ నేదదేర్పఁ బతి హాయనియెన్ సతిసల్పఁగా రతిన్.

గీ. నటదురోజంబు నిటల సంఘటితకచము । పర్యటద్వల్లితాటంక పాటవంబు
కటితటీస్రమటత్కాంచికాకలాప । మపరిరతమిచ్చుఁ గా సౌఖ్యమపరిమితము.

ఉ. చొక్కి ప్రసూనశయ్య రతిసోలియుఁ జాలుఁజుమీ యనంగఁ బోఁ
డిక్కమలాక్షి నిట్టెరమియించెద నంచుఁ దలంచునాథుఁడా
జక్కవగుబ్బలాడి యరజాఱిన కొప్పుపిసాళిచూపులుం
జక్కెరమోవితోఁ గళలు చల్లెడు మోమెటువంటిదో గదా.

సీ. కసరుచో బలిమికాటనిఁబోవు మోవితో గురుకచాకచి నెగుల్ కురులతోడ
కబళించివిడిచిన గళ్లపాలికతోడఁ బెనఁకువవసివాడు తనువుతోడ
చుంబనక్రియమీఁదు చూచుముంగరతోడఁ జేపట్లమీఁజేతి చీరతోడ
రమ్యముష్టాముష్టి రాలుగాజులతోడఁ బైకొన్నరతితొట్రుపాటుతోడ
నింతకటిమోపి కడమకోకెడమచంకఁ । బెట్టిధమ్మిల్లమొకచేతఁబట్టి యొక్క
కేలఁ గీలించిన పసిండిగిండితోడ । విభునితోఁగూడి పడకయిల్ వెడలె వెలఁది.

క. వెడలి సతిరతిఁబెనంగిన । బడలిక నిట్టూర్పు తొట్రుపాటును జనుగో
రడి మోవికాటుచిమచిమ । జడిచెమట నటింపఁజూపె సౌఖానగతుల్.

ఉ. బాణభుజారి భూనటదపారకృపారహితాజిఖిన్నతన్
బ్రాణయొకింతలేక నడతక్కువతోఁ జనుమోఁతతో గళ
ద్వేణిభరంబుతో నపుడు పెన్నెలపైటికివచ్చినన్ జగ
త్ప్రాణను కూర్మికోడలికిఁ బ్రాణముదెచ్చెగతిప్రవీణయై.

ఉ. కూర్చిన మైకదంబములుగొన్నిగరంచితిఁ గాని క్రమ్మఱన్
గూర్చఁగనేరనైతి ననుఁగూడిన గాడ్పుగరంగి వీఁగురా
కూర్చినడెందముం దిరుగఁగూర్చఁగదా రతికన్న చింతనో
యేర్చినమిన్నవంటి తరలేక్షణమై చెమటల్ నశించుటల్.

క. ఈపగిదిఁ గడమనల్లురు । ద్రౌపదితోఁ గ్రీడఁగనుచుఁ దమసంకేత
వ్యాపారనైపుణక్రమ । మేపారవశించిరొక్కయేఁడవ్వీటన్.

గీ. తరికి వానలుగురిసె భూతలముపండెఁ । బరచమూజారచోరాగ్ని భయముపఱచె
ధర్మమెంతయు నాల్గుపాదముల నడిచె । ధర్మరాణ్ముఖ్యులవ్వీటఁ దనరుకతన.

శా. ఈతీరంతయుఁ జారులెంతయుఁ గరంబేపారఁగాఁ జెప్పినన్
జేతోమోదము దక్కియక్కురుకులశ్రేష్ఠుండు దుర్యోధనుం
డైతే నేమి పృథాతనూభవ వివాహాదుల్ విన న్వచ్చునా
జ్ఞాతిశ్చేదనలేనకిమ్మనుచుఁ జిన్నంబోయి యున్నంతటన్.

సీ. కౌంతేయులజయించుటెంతనియనెఁ గర్ణుఁడనుచితంబనియాడె నాంబికేయుఁ
డిదియేటిమాటనియెను దుస్ససేనుండు పట్టితెత్తమటంచుఁ బలికె శకుని
యర్థరాజ్యమొసంగుఁడనియెను విదురుండు కార్యహానినియె గంగాతనూజుఁ
డర్జునుగెల్వరాదనియె ద్రోణాచార్యుఁడుచటు నెఱుఁగుదురనియెఁ గృపుఁడు
ద్రుపదుఁ బరిమార్తమనియెను ద్రోణసుతుఁడు
సౌమ్యుదినఁబ్రాప్తులనఁజొచ్చె సోమదత్తుఁ

డవును విదురునిఁబంపి పాండవులనిటకు
సరగఁ బిలిపింపుఁడనిపల్కె సంజయుండు.

క. దుర్యోధనుఁడపుడిట్లను । దుర్యోచనలింతయేల దుష్టాత్మకులన్
గార్యముగాదిటఁజేర్చుట। మర్యాదుల్ సాదులెట్లు మఱిదాయాదుల్.

క. దాయాబోయాయనఁగా । మాయోపాయోద్ధతులు కుమార్గులు హితమే
ధాయుక్తులబలెనుందురు। దాయాదులు వేళవచ్చుదాఁక సహిష్ణుల్.

క. కుడిచినయింటికిరెండె । ప్పుడు దలఁతురనంగవలదు భూతలమెఱుఁగున్
గుడినుండిదె గుడిత్రాళ్ళె । క్కుడుగాఁగోయుట సగోత్రగుణములుసుమ్మీ.

క. ఏయెడమదినైరపరికం । బైయుండినఁ గార్యమొప్పదమరించుటకున్
డాయుచు రోయుచుఁజేసిన । నాయంబగుసఖ్యభోజనంబులు ధాత్రిన్.

క. దాయాదులు మాయాసము । దాయాదులువచనమధురతామిష సకలా
దాయాదులు కలహామం । దాయాదులుధరణియెఱుఁగదా యాదుడుకుల్.

గీ. అయిననేమాయె నేమాయనైననేమి । యంతలేదంద్రుగాకొక్కచెంతనంచు
విదురుఁదోడ్తెంచురమ్మన్నవేగనతఁడు। ద్రుపదపురిఁజేరిపాండుపుత్రులనుగాంచి.

మ. ధృతరాష్ట్రుండు సుయోధనుండు మిముఁదోడ్తెమ్మంచు మమ్మంపిరీ
గతిఁ బాంచాలునియింటబాములఁ బడన్ గర్తవ్యమానేఁడు మీ
పితృరాజ్యంబు సగంబుగొమ్మని సమర్పించంగ నూహించిరీ
రతివేగంబున రండటంచు విదురుండాడెన్ మహోత్సాహులై.

ఉ. పెట్టెలుపెట్టుఁడి క్కురటిబృందముమీఁదను బట్టుటెక్కెముల్
గట్టుఁడు యోధయూధములకున్ జగముస్తైయిదేర్పరింపుఁ డా
రట్టతురంగ ఘట్టములరాజులకెల్లను బల్లకట్టుఁ డి
ప్పట్టణమందెరాణువకు బత్తెమువేయుఁ డటంచుఁబల్కుచున్.

ఉ. పైనముసైరి పాండునరపాలతనూజులు యజ్ఞసేన భూ
జానియనుజ్ఞ నశ్వములుసాఁగె రథప్రకరంబు వెళ్ళె మ
స్తేనుఁగుతండముల్ గదలె నేగెభటచ్ఛట బోనపుట్టికల్
మైనపుఁజీరపెట్టియలుమంకెనగిత్తలుగాంచె నెన్నడల్.

గీ. పడుచునంపుమన్న పలుకుచేఁజెవిగ్రాఁగె। గుండెపగిలె దిగులునిండెనిగులఁ
గలఁగె డెందమేఱుగాఁబాఱె కన్నీరు । కన్నతల్లినెనరుగాననయ్యొ.

గీ. ఇల్లటంపుమాటకేపాటివాఁడైన। లేఁతరాచబిడ్డలేకపోయె
రాజయోస్వయంవరంబేల చాటించె। వెలఁదిపెండ్లికేమివేగిరంబు.

ఉ. ఎక్కడఁబుట్టె నిక్కలికి యెవ్వరుచన్నిడి రెత్తిపెంచఁగా
నెక్కడమక్కువం బెరిగె యెవ్వరిపాల్ తుదిచేరెఁ జెంతగా
దక్కటదూరదేశమున కంపకమాయని కన్నతండ్రి తా
స్రుక్కెఁదలంచినం గడుపుచుమ్మలుచుట్టెడి నేమిసేయుదున్.

శా. ఆఁడుంగాన్పనుగంటకన్న సతిగొడ్రాలౌటయేమేలు నూ
ఱేఁడుల్పెంచినఁ గూఁతురేమి సతమాయీవియ్యముల్ కోడలిన్
గాఁడంబల్కినఁ దాఁళఁగావలెనెఁగాకాఁగాని తిట్లాడికల్
నేఁడీతండ్రియుఁ దల్లివంగడముగానీ పంచుకోనాయెఁగా.

సీ. పాంచాలిపాంచాలి పరిణయేచ్ఛలనున్న లంచానఁదలఁగడిగించ నెవ్వ
రెవ్వరాఁకోన్నచో నింటియక్కల నొక్కకొలికికిఁ దేఁదాళుకొనెడువారు.
తెల్లవాఱకమున్నె పల్లెరంబిడి ముఖప్రక్షాళనాదరసూక్తి పలుపనెవ్వ
రెవ్వరు ప్రేల్మాలిపవ్వళించినలేపి కన్నులుదుడిచి యాఁకటికినరయు
రచ్చసేయంగవచ్చునోయిచ్చవచ్చు। నుత్సవముఁజూడఁగూడునోయొకరికొకటి
యొసఁగఁబోసఁగునోమిసుకరాదో పరులకుఁ।బుట్టినిల్వలె నత్తయిల్లెట్టులగును.

ఉ. కాంతులు ధర్మరాణ్ముఖులుగా బలుగామిడిగాని యత్తగా
కుంతియు నాఁటినాఁటి కిదిగో పిలిపించెదనంటినా యరో
యింతలనంతలం బరులయిండులకన్యలధన్యలన్ జన
న్యంతిక సంచరంతికల నమ్మలఁజూచి భరింపశక్యమే.

వ. అని వితర్కించి యక్కించి దవలగ్ననవలోకించి మిగుల వగలఁదగులుట గని దిగులుపడవలదని వలుదక్రొవ్వేదదువ్వి యవ్వికచనయనచకచకలు చేర్చుచేర్చుక్కఁ జక్కంజెక్కు చెక్కుటికన్నీటిచాలింతికొనగోరఁ బాఱమీటి మీటిది గాదని తొంటిదిగెంటించితాఁ బెట్టిన గట్టి ముక్కరపట్టికింబెట్టి కట్టాణి ముత్తియంపుఁ గుత్తికంటుచేనంటిచూచి చూచుకంబుల పోఁటునంబాటిల్లు పాటీర పంక నిచయాంక కుచయాయిశిథిలాంబరంబు సవరగా సవరించి యుదరంబు నివిరి యరవిరిచెందంపుటుదిరి యందంపు సంపంగి విరితండంపుదండ సందిదండ లాకపూఁటనె వదులయ్యెనని త్రిప్పిత్రిప్పి యరసి కరశాఖాంగుళీయక గ్రామణులం బోఁడిమిచేసి పాణితలరేఖ లీక్షించి కన్నుల నొత్తుకొని హత్తుకొని పాక్కిలి ముద్దుగొని మిక్కిలి సద్దుగనిన సిద్దంపు మొలనూలి చిఱుగంటల చిక్కుదీర్చి చెంగావి చేలనెరుక మీఁగాళ్లంగూర్చి పట్టిమట్టియలు పటికి నార్చు కోరికలత్తుక చిత్తంబు పెల్లగింపఁ దనూవల్లి కౌఁగిటనల్లియల్లిబిల్లి తన

యామతల్లికిఁ దల్లియిట్లనియె.

మ. ఎదవోఁజూచెదవో సుదంతికిఁబోలంతీక్షాంతి యొప్పంచుఁ జె
ప్పుదు వే నీచదు వేలయెంచవు చవుల్ పుట్టింప నీపుట్టిని
ల్లిదె రేఁపే పిలిపించెదం జెదరనీకేలమ్మ మేమున్న యీ
పదివేలేండ్లకు నేమిటుఁగడమయో పర్వేందు బింబాననా.

శా. నీపైంత్రీడయె తండ్రికన్నకటులన్ నీమీఁదిదేదృష్టినా
కాపంచాసులు నీవెసుమ్ము గొలువంకల్ పెంపుడుం జిల్కలున్
నీపల్కుల్ ప్రకటింపఁగా మఱపు గందే(మాదృశుల్ రేపె యీ
దీపావళ్యభిధోత్సవంబునకె తోడ్తేఁబంచెదం దొయ్యలీ.

ఉ. చిత్తమెఱింగి భర్తలకు సేవలుసేయుట ధర్మమమ్మ లో
కోత్తర యత్తగారి కెదురుత్తరమెత్తకుమమ్మ యమ్మరో
యెత్తకు వంచినట్టి తలయియ్యమ తొయ్యలులందు నంతయ
త్యుత్తమరాలు మేలనఁగనుండుట భూషణమమ్మ కోమలీ.

క. కలవారిపడుచననుచున్। దెలిపెదు నూనడకచేత దీనులఁబతులీ
వులు గొంచెమిడినఁ బదివేల్। ఫలియించె నటంచు గానిపదరెదు సుమ్మీ.

క. వింటేయనితనయన్ వా। ల్గంటింబంపుటకుఁదల్లి కడువెలవెలనై
యుంటకు డగ్గుత్తికతోఁ। గంటందడిపెట్టిరింటఁగల కలకంఠుల్.

ఉ. సోదరిమాఱు నీకలతలోదరినీదరిదాపె యీపెకున్
జూదరిగాదు సాదు నను(జూచిన యట్లనె చూడుపోఁడ యీ
దాదికొమార్తె యీయమ నదల్పకుమీయని యాడిగానకున్
హైదలిపిండునిచ్చె నటఁబంపుటకున్ జనయిత్రిపుత్రికిన్.

క. ఆవేళఁబురము పాండుమ। హీవల్లభసుతులు వెడలిరేవురు శంఖా
రావములునిగుడ రింఖా। వ్యావల్గద్వాహవాహనా రోహణులై.

గీ. అరుగుదెంచిన వృత్తాంత మూంచి కేయుఁ। డెఱిఁగి దుశ్శాసనాదుల నెదురుపంప
వాహనవ్యూహ సకలసన్నాహమహిమఁ। గరిపురికివచ్చి రక్కుంతికన్నసుతులు.

సీ. హీనవృత్తికిఁజిత్తమింత యొగ్గఁడుగాని సత్యసంధత హరిశ్చంద్రుఁడితఁడు
హాలాహరణహేల నావహిల్లఁడుగాని బాహాపటిమ బలభద్రుఁడితఁడు
మత్తారిహతికి సామగ్రిగోరఁడుగాని వింటినేర్పునకు ముక్కంటియితఁడు
బడబోదరంబునఁబడి వెళ్లఁడనికాని వాజినెక్కుటకు రేవంతుఁడితఁడు
పాలుమ్రుచ్చిలుటకుఁ జాలుపడఁడుగాని। ధేనుసంరక్షణకువాసుదేవుఁడితఁడు

బళిరయని వీధిఁజనుదెంచు పాండవేయ । పంచకముఁగాంచి రప్పుడప్పౌరులెల్ల.

శా. పాంచాలీచలదృక్ప్రభావభయభ్రాంతిన్ నిలన్ లేక మి
న్నంచుల్ ప్రాఁకెడుచేపఁ జాపలతనేయంబాడియేయున్నరుం
డంచుం దక్కినబేడసల్ గవిసెనా నప్పార్థుపైఁ బౌర భా
మాంచచ్చంచలలోచనాంచల నికాయంబంత వ్రాలెన్ వడిన్.

క. అందఱిపైఁజేతెడు పాడ । వందిన తుందిలునమందయానను నభస్వ
న్నందన మణిఁగనియందఱి। కిందగుటఁగికాకికన్నగిరిపురివారల్.

క. చక్కనివాఁడఁట తెజీ । నెక్కుటకున్ సవతులేదటే కామినియున్
జొక్కనిదొక్కతె లేదఁట। యక్కరొకనుఁగొంద మాదయాకులునకులున్.

క. మదిరాక్షికి నేగురుమగ । లదిరా మదిరాగమిపెకని వదరెదవే
పదుగురు పదియేగురుగా। రిది యొకయాశ్చర్యచర్యయే కామినికిన్.

మ. మొలఁతాకోవెలకుంట నాథుమొకకొమ్మదిద్దనీప్రొద్దు వ
ర్తిలెఁగా రెండవకొమ్ముదిద్దుటకుఁ బ్రొద్దే చాలదొక్కింతవా
డల పిల్లల్ నగికొంచుఁజప్పటలు గొట్టంగట్టుకొంగూడఁగాఁ
దలవీడం బరువెత్త నిత్తెఱవ వింతల్ చూడరాలేవుగా.

చ. పసపులుపూయనిమ్ము తెలిపావడపై నుసుఁగావిగట్ట ని
మ్మసమ కటీతటీ పటి సమంచితమేఖలయుంచనిమ్ము నె
న్నొసట లసన్మణీఘృణిశినూత్నలలంతిక వెట్టనిమ్ము వె
క్కసపుఁ బిసాళులిమ్మెటుఁగుఁగమ్మలు చాలవె ముద్దుగుమ్మకున్.

సీ. గౌరాంగి కాచంద్రకావిచామనచాయ చామకే చక్కన చపలనయన
గొప్పా పెకాగట్టి కురుమట్టపుమిటారి కేకాకకీల్జడ కిసలయోష్ఠి
యలఁతిచన్నులదానికా హారవల్లరు లున్నతస్తని కెపొసన్నుతాంగి
బక్కామెకాలేఁత పాటీరపుంబూఁతలావైన లలన కెలసదపాంగ
వారికొకపక్షమునఁ గఱివన్నెకోక । కొప్పుగుండుల పేరుబాగొప్పరవికె
చెప్పఁజొప్పగునంచుఁగ్రైనేసిడాని। సకులు నకులాదులను జూడ సాగిరచట.

క. చనుదెంచియాంబికేయున। కును గాంధారికిని మ్రొక్కి కుంజరపురిలో
ధనధాన్యవస్తునిస్తుల । ఘనతవసించిరి కుమారకంఠీరవులై.

సతనయవర్గమునకన్నను ననువుగఁ బాండునందన గ్రామణులన్
ఘనఘృణులన్ దినమణులన్ । ధనమణులన్ బెద్దతండ్రి దనిపెన్ మనిపెన్.

హస్తిపురములోన నైదేఁడులున్నంత। నంతకాత్మజునకు నాంబికేయుఁ

డర్థరాజ్యమిచ్చి యభిషిక్తుఁ గావించె। సకలబంధుసంఘసమ్మతముగ.

క. అభిషిక్తుఁ జేసి యిభపుర। విభుఁ డింద్రప్రస్థమనెడునీ డిచ్చినఁ. బాం
డుభవుండు భీమసేన। ప్రభృతులతో భూమి యేలెఁ బ్రాభవలీలన్.

సీ. గంటెడు నేలైనఁ బంటకబ్బని చేను పింపిళ్ళు గూయని గుంపు పైరు
సేనపాతరకొల్చు లేనిహాళికమూళి బానెడు పాలీని పాఁడియావు
పాడిచితేనెక్కడఁ బ్రొద్దాయెనని పెద్ద జేజే యిడని ద్విజరాజరాజి
వింతకు బేరుఁడై విజ్ఞవీఁగని బేరి పుట్టుభోగులు గాని భూభుజులును
బన్నిదమునకుఁ గాన మెప్పట్టునందు। ధరణితరుణి శిరోమణి దారకరణి
తరణిశరణిభవద్ధామ ధర్మరాట్ప్ర।సన్నభుజపీఠిఁ గాపురంబున్న కతన.

ఉ. తమ్ముఁడు దోర్బలాఢ్యుఁడఁట తమ్ముని తమ్ముఁడు గార్ముకంబుచే
నిమ్మహి వార్తకెక్కెనఁట యిద్దఱు తక్కిన తమ్ములాజిలో
దమ్ములు రేఁచు శూరులఁట దుర్మదవైరుల ధర్మకర్మతుం
డమ్మరొ ధర్మరాజుఁ గొనియాడఁగఁ జెల్లదె యెల్ల దేశముల్.

క. ఆపదలు గదలు రాజ్యము। చేపడు జయమబ్బు సిరులు చేరున్ బహుక
న్యాపాణిగ్రహమలవడు। నీ పాంచాలీపరిణయమించుక విన్నన్.

క. అని వైశంపాయనముని। వినిపించిన విని వినీతవిమలాత్మకుఁడా
జనమేజయ జగతీవిభుఁ। డనురాగసుధాబ్ధి నోలలాడుచునుండెన్.

మ. భ్రుకుటీమాత్రకుటీ విలంఘన గళద్భ్భదేవతాదీనతా
ముకుటీరాజతటీ పటిష్ఠరుచినిర్ముక్తాపరాశాతనూ
ప్రకటీభూత కటీరహాటక పటీపర్యంక హస్తాంబుజా
సుకటీరత్నఘటీ కుచామణితటిత్సుక్ష్మాలయప్రాంగణా.

క. శతకరపుష్కరిణీవిక। సిత సరసీరుహమరందసేవాహావా
గతచరితదురిత విరహిత। హితమారుత శీతసురభి మృదుపర్యంకా.

మాలిని. దితిసుతనుతకోటీ దేవపూజార్హపేటీ। కృతనటనవధూటీ కీర్తితాగార
శతమఖముఖజూటీ సంచరత్పాదధాటీ। హతనతదురితాటీ కాంతి కార్పణ్యా:

గద్య. ఇది శ్రీమద్రామభద్ర భజనముద్ర కవిపట్టభద్ర కాద్రవేయాధిప వరసత్య
సరససారస్వతలహరీపరిపాక కాకమాని ప్రబోధబుధకవి సార్వభౌమసై
లింగభట్టపుత్ర కౌండిన్యగోత్ర భాగధేయమూర్తి నామధేయప్రణీతంబైన
పరిణయంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసః
[illegible]